

AHKAMUL - ISLAM

# అహ్కాముల్ ఇస్లామ్

## (ఇస్లామ్ మతధర్మములు)

ఆఱవ కూర్పు.

గ్రంథకర్త:

మౌల్వీ మున్షి ఫాజిల్

**ముహమ్మద్ అబ్దుల్ గఫూర్**

కంబము (కర్నూలు జిల్లా).

---

రిజిష్టరు బడద ] 1958 [ వెల 0_8_0







# అహ్కాముల్ ఇస్లామ్

## (ఇస్లామ్ మతధర్మములు)





ఆఱవ కూర్పు.






గ్రంథకర్త:

మౌల్వీ మున్షీ ఫాజిల్

## ముహమ్మద్ అబ్దుల్ గఫూర్

కంబము (కర్నూలు జిల్లా).











రిజిష్టరుడ్ ]    1958    [ వెల 0_8_0




# విషయసూచిక


| | పుట |
|---|---|
| ఇస్లామ్ | 1 |
| ఈమాన్ | 2 |
| షిర్కు బిద్అత్ | 8 |
| మహాపాపములు | 10 |
| నమాజ్ | 11 |
| వజూ గుసుల్ | 13 |
| బావిశుద్ధి | 16 |
| తయమ్ముమ్ | 17 |
| నమాజువేళలు | 18 |
| అజాన్ | 19 |
| సూరాలు | 21 |
| నమాజు పద్ధతి | 26 |
| వితరు నమాజు | 28 |
| నమాజె ముసాఫిర్ | 29 |
| నమాజె బీమార్ | 29 |
| సజ్దయె సహూ | 30 |
| మక్రూహాతె నమాజు | 32 |
| సజ్దయే తిలావత్ | 33 |
| ముద్రిక్ మస్బూఖ్ లాహిఖ్ | 34 |
| నమాజెఖజా | 34 |
| నమాజె జుమా | 35 |
| నమాజె కుసూఫ్ | 37 |
| నమాజె ఇస్తిస్కా | 37 |
| నమాజె తరావీహి | 38 |
| ఏతికాఫ్ | 3[illegible] |
| నమాజె ఈదైన్ | 39 |
| ఖుర్బానీ | 41 |
| జబాచేయుపద్ధతి | 42 |
| భక్షింపగల మాంసము | 43 |
| సక్రాత్ | 43 |
| గుసులెమయ్యిత్ | 44 |
| కఫన్ | 45 |
| నమాజె జనాజా | 46 |
| సమాధి (దఫన్) | 47 |
| ఫాతిహా | 48 |
| జియారతెఖుబూర్ | 48 |
| జకాత్ (విధిదానము) | 49 |
| సదఖయే ఫితర్ | 51 |
| నజర్ | 52 |
| ఉపవాసము (రోజా) | 52 |
| ముఫ్సిదాతె రోజా | 53 |
| కఫ్ఫారా | 55 |
| హజ్ (కాబాయాత్ర) | 56 |
| వ్యాపారము | 59 |
| పెండ్లి | 60 |
| పెండ్లాడదగిన స్త్రీలు | 61 |

# అహ్కాముల్ ఇస్లామ్

—: ఇస్లామ్ మతధర్మములు :—

ఇస్లామ్ అనుపదమునకు విధేయత, ముక్తి, రక్షణ శాంతము సంధి అను అర్థములు గలవు. ఇస్లామును స్వీకరించిన వారు ముస్లిములు. ఇస్లామ్అర్థమునుబట్టి ముస్లిములు దేవునాజ్ఞలందు విధేయత గలిగి యుండవలెను. దానిచే ఇహపరములందును రక్షణ ముక్తి లభించును. ఇస్లామ్, లోకమునందు శాంతము సంధి కూర్చునది. ఇస్లాముయొక్క ప్రతిధర్మమునుజూచిన దానియందున్న అర్థభావము తెలియనగును. ఇస్లామ్ మత ధర్మములకు దేవదత్త గ్రంథముగు ఖురానెషరీఫు మూల ఆధారము. మఱియు హజ్రత్ ముహమ్మద్ పైగంబరులవారి యుపదేశములును వారియాచారము (సున్నతు)లును ఇస్లామ్ ధర్మములకు మూలాధారములును ప్రమాణములును. ఖురానెషరీఫును పైగంబరుల వారియుపదేశముల (సున్నతు) ను అనుసరించి ఇజ్మా ఏర్పడును. ఆ మూటినుండి ఖియాసు ఏర్పడును.

ఇస్లామ్మతమునకు అయిదు ధర్మములు పునాదివంటివి. (1) మొదటిది విశ్వాసము. దానినే ఈమాన్ అనుదురు. అది కలిమా అను వాక్యమును మనఃపూర్వకముగా విశ్వసించి దాని భావమును గ్రహించి దానిని వాక్కుతో నుచ్చరించి ఖరారుచేయుట. (2) రెండవది ప్రతిదినము అయిదుపూటలు నమాజు (ప్రార్థన) చేయుట (3) మూడవది జకాతు విధిదానము నొసంగుట. నాలుగవది రమజానునెల పూర్తిగ ఉపవాసములు (రోజా) ఉండుట. అయిదవది కాబామసీదుయాత్ర (హజ్) చేయుట. ఇక ప్రతి ధర్మమునుగూర్చి వివరముగా వ్రాయుదుము.

—: ఈమాన్ (విశ్వాసము) :—

1. లాఇలాహ_ఇల్-లల్లాహు-ముహమ్మదుర్-రసూలుల్లాహి. అర్థము: అల్లాః తప్ప వేఱు పూజ్యుఁడు లేఁడు. హజ్రత్ ముహమ్మదు వారు దేవునిచే పంపఁబడిన ప్రవక్తలు. దీనినే కలిమయే తయ్యిబా అనుదురు. 2. అష్‌హదు - అన్ - లాఇలాహ-ఇల్ -లల్లాహు-వ-అష్‌హదు-అన్న - ముహమ్మదన్ అబ్దుహు-వ రసూలుహుఅర్థము:- అల్లాః తప్ప వేఱుపూజ్యుఁడు లేఁడు అనినేను సాక్ష్యమిచ్చుచున్నాను. హజ్‌రత్ ముహమ్మదు వారు దేవుని భక్తు (సేవకు) లనియు దేవుని ప్రవక్తలనియు నేను సాక్ష్యమిచ్చుచున్నాను. దినినే కలిమయేషహాదత్ అనుదురు. 3. (కలిమయే తమ్జీద్) సుబ్‌హా_నల్లాహి_వల్_హమ్‌దు_లిల్లాహి _వలా-ఇలాహ_ఇల్ లల్లాహు_వల్లాహు_అక్బరు_వలా-హౌల - వలాఖువ్వత-ఇల్లాబిల్లాహిల్ _ అలీయిల్ – అజీమ్. 4. (కలిమయేతౌహీద్) లా ఇలాహ ఇల్ లల్లాహు_వ హ్‌దహు_లాషరీక- లహు లహుల్_ముల్కు _ వలహుల్_హమ్దు _ యుహ్‌యీ-వయుమీతు _ బియదిహిల్_ఖైర్_వహువ_అలాకుల్లి_షైయిన్_ఖదీర్. 5. (కలిమయేరద్దెకుఫ్ర్) అల్లాహుమ్మ_ఇన్నీ_అఊజు బిక_మిన్_అన్ ఉష్‌రిక బిక_షైఅన్_వఅనా _ ఆ లము_బిహీ తుబ్తుఅన్‌హు_వతబర్రాతు _ మినల్-కుఫ్‌రి_వష్_షిర్కి_ వల్ మఆసీ_కుల్లిహా_అస్ లమ్తు-వ ఆమన్తు_వ-అఖూలు- లాఇలాహ ఇల్_లల్లాహు_ముహమ్మదుర్_రసూలుల్లాహి.

ఆమన్తు-బిల్లాహి-కమా_హువ_బి_అస్మాయిహీ-వసిఫాతిహీ-వ-ఖబిల్తు_జమీ-అ - అహ్కా_మిహీ:అర్థము:దేవుఁడు తన నామములతోను గుణము (సిఫాతు) లతో నుండినట్లు నేను విశ్వ

సించి యతని సమస్త ఆజ్ఞలను ధర్మములను సమ్మతించితిని. దీనినే ఈమానె ముజ్మల్ అనుదురు.

ఆమన్తు_బిల్లాహి-వ-మలాఇ_కతిహీ_వకుతుబిహీ_వరుసు_లిహీ వల్-యౌమిల్-ఆఖిరి వల్-ఖద్రి_ఖై రిహీ_వ_షర్రిహీ మినల్లాహి-తఆలా-వల్-బాసి _ బా_దల్-మౌతి-అర్థము: అల్లాః యందును, అతని దూతలయందును, అతని గ్రంథములయందును, అతని ప్రవక్తల (పైగంబర్ల) యందును, నేను విశ్వాసముంచితిని. మఱియు తుదిదినము (ఖియామతు) ను, మేలు కీడు దేవుని నియ్యామకము (తఖ్దీర్) వలననే గలుగుననియు, మరణించిన పిదప తిరిగి సజీవులగుదురనియు నేను విశ్వసించితిని. దీనినే ఈమానె ముఫస్సల్ అనుదురు.

పై జెప్పఁబడిన వానినన్నిటిని మనః పూర్వకముగా నమ్మి విశ్వసింప వలయును. వానిలో నేదైన నొకదానియందు అవిశ్వాసముంచిన వారు అవిశ్వాసులు (కాఫిర్లు) అగుదురు. ఈమానె ముఫస్సలలో చెప్పఁబడిన వానిని వివరముగా నిఁక వ్రాయుదుము.

దేవునియందు నిట్లు విశ్వాస ముంచవలెను. దేవుఁడు ఒక్కఁడు. అతఁడు అద్వితీయుఁడు. అతనికి సాటిలేదు. అతనినే యారాధింపవలెను. అతఁడే పూజ్యుఁడు. అతఁడు సర్వజ్ఞుఁడు. అతఁడు సమస్తము ఎఱుఁగును. అతని కెదియును మఱుఁగులేదు అతఁడు సర్వశక్తుఁడు. అతనికి మించినది లేదు. సమస్తము అతని శక్తివలననే గలిగినది. అతఁడు కోరినది చేయును. అతఁడే సృష్టికర్త. అతఁడే భూమ్యాకాశములను సూర్య చంద్రాదులను నక్షత్రములను దూతలను జిన్నాతులను భూమ్యాకాశములలోని

సమస్తమును సృజించెను. సమస్తమునకు అతఁడే ప్రభువును పోషకుఁడును. అతఁడే ప్రాణము నిచ్చుచున్నాడు. మఱియు నతఁడే చావునిచ్చుచున్నాఁడు. సృష్టియంతటికిని అతఁడే ఆహార మిచ్చుచున్నాఁడు. అతఁడు తినఁడు త్రాగఁడు. నిద్రపోఁడు. మృతి నొందఁడు. అతఁడు స్వయముగానున్నాఁడు. ఆది మధ్యాంతములు లేనివాఁడు. సదాయుండువాఁడు. సమస్తము అతనిపై నాధారపడియున్నది. అతఁడు నిరాధారుఁడు. అతనికి తల్లిదండ్రులు లేరు. అతనికి భార్య బిడ్డలులేరు. ఎట్టి బంధుత్వమును లేదు. అతఁడు నిరాకారుఁడు. ఎట్టి రూపమును ఆకారమును లేనివాఁడు. అతనిని పోలినది ఎద్దియును లేదు. అతఁడు పరమ పవిత్రుఁడు. ఎట్టి లోపములును లేనివాఁడు. మానవులవలె కాళ్లు చేతులు ముక్కు నోరు మొదలైన అంగములు లేనివాఁడు. అతఁడే దూతలను పుట్టించి వారిని వారికిఁదగిన కార్యములందు నియమించియున్నాఁడు. అతఁడు మానవులకు సన్మార్గము చూపుటకై అనేక ప్రవక్తలను పంపెను. ఆ ప్రవక్తలు సన్మార్గమును బోధించిరి. దుర్మార్గములను నిషేధించిరి.

## —: దేవదూతలు (ఫరిష్తే) :—

దేవదూతలను అరబీ భాషలో 'మలాయికా' అనుదురు. వారిని దేవుఁడు జ్యోతి (నూర్) తో సృజించెను. వారు మన చూపులకు కానరారు. వారు పురుషులును స్త్రీలును కారు. వారియందు సంసార బంధములు లేవు. తినుట త్రాగుట నిద్ర పోవుట మలమూత్రవిసర్జనము మొదలైన మానవుల గుణములు వారియందులేవు. అసూయ, క్రోధము ఇచ్ఛ, గర్వము మొదలైన గుణములు వారియందులేవు. ఎల్లప్పుడు దేవునికి విధేయులై

యుందురు. దేవుని యుత్తరువు ప్రకారము చేయుచుందురు. వారియందు అవిధేయతలేదు. దేవుఁడు వారికి నియమించిన కార్యములందు నిమగ్నులై యుండుదురు. వారిసంఖ్య దేవునికే తెలియును. అయిన వారి సంఖ్య అనేకము. వారిలో నలుగురు చాలముఖ్యులు. అందు (1) జిబ్రయీలు అను దూత దేవుని గ్రంథములను దేవునాజ్ఞలను దేవుని ప్రవక్తలకు నందఁజేయు చుండెను. (2) ఇస్రాఫీలు అనుదూత తుదిదినము (ఖయామతు) నందు సూరుఅనుశంఖము నూదును. (3) మేకాయీలు అనుదూత వర్షము కురిపించుటకును లోకమునకు ఆహారమునందఁజేయుటకును దేవునిచే నియమింపఁబడి యున్నాఁడు. (4) ఇజ్రాయీలు అను దూత జీవుల ప్రాణము తీయుటకై నియమింపఁ బడియున్నాఁడు.

—: దేవుని గ్రంథములు :—

దేవుఁడు ప్రజలకు ధర్మమార్గము చూపుటకై తనప్రవక్తలకు గ్రంథము లొసంగెను. దేవుఁడు పంపిన గ్రంథములన్నియు సత్యము. అందుగల ధర్మములు సత్యము. దేవుఁడు పంపిన చిన్న పెద్దగ్రంథములు అనేకములుగలవు. వానిని కితాబ్ అనుదురు. అందు నాలుగు గ్రంథములు ప్రసిద్ధమైనవి. అవి తౌరాతు, జబూరు, ఇన్జీలు, ఖురానెషరీఫు అనునవి. తౌరాతు గ్రంథము దేవునిచే హజ్రత్ మూసా ప్రవక్తగారికి నొసంగఁ బడెను. జబూరు గ్రంథము హజ్రత్ దావూదు ప్రవక్తగారికి నొసంగఁ బడినది. ఇన్జీలు గ్రంథము హజ్రత్ ఈసాప్రవక్తగారికి నియ్యబడినది. ఖురానెషరీఫు గ్రంథము హజ్రత్ ముహమ్మద్ పైగంబరులవారికి నొసంగఁబడినది. ఖురానెషరీఫునుగూర్చి జగత్ ప్రవక్తలో వ్రాసియున్నాము (చూడుపుట 314). కొందఱు

ప్రవక్తలకు కొన్ని చిన్నగ్రంథములు దేవుఁడు ఒసంగెను. వానిని సహీఫా అనుదురు. వానిలో కొన్ని హజ్రత్ ఆదము ప్రవక్త గారికిని నొసంగఁబడినవి. మఱికొన్ని సహీఫాలు ఇతర ప్రవక్తలకుఁగూడ నొసంగఁబడినవి.

—: దేవుని ప్రవక్తలు (పైగంబరులు) :—

దేవుఁడు మానవులకు ధర్మమార్గము చూపుటకై అనేక ప్రవక్తలను నియమించెను. వారు గూడ మానవులే. వారు సత్యవంతులు. అబద్ధము పలుకరు. వారుపాపములుచేయరు. వారి జీవితము పవిత్రము. ప్రజలకు మార్గదర్శకము. వారు దేవుని సెలవుచే మానవ శక్తికి మించిన అద్భుత కార్యములు చేసిచూపుదురు. అట్టివే మోజిజాలు అనఁబడును. దేవుఁడు పంపిన ధర్మములను హెచ్చుతక్కువ లేకుండ లోకులకు నుపదేశింతురు. ప్రవక్త పదవి మానవ యత్నము వలన లభించునది కాదు. అది దేవుఁడుకోరిన వారికి నొసంగునది. గ్రంథము నొసంగఁబడిన వారికి రసూలు అనిపేరు. వారినే ప్రవక్త లేక పైగంబరు అని తెనుఁగులో వాడుదుము. దేవుని ప్రవక్తలు అనేకులు గడచిరి. వారిలో మొట్టమొదటివారు హజ్రత్ ఆదము ప్రవక్తగారు. ప్రవక్తలలో నందఱికన్న కట్టకడపటివారు హజ్రత్ ముహమ్మద్ రసూలు వారు. వారి పిదప ప్రవక్త పదవి ఎవరికిని లభింపదు. ఎవరును క్రొత్త ప్రవక్తలుగా రారు. వారి పిదప ఎవఁడైన నేను ప్రవక్తను అని చెప్పుకొనినచో అది నిజముకాదు. అట్టివాఁడు అబద్ధవాది, మోసగాఁడు అని తెలిసికొనవలెను. హజ్రత్ ముహమ్మద్ రసూలువారికి ప్రవక్తలలో ఉన్నత పదవి లభించినది. వారు దేవుని పరమ భక్తులు. అందఱిలో శ్రేష్ఠులు. వారిని గూర్చి

జగత్ ప్రవక్తలో వివరముగా వ్రాసియున్నాము. దేవుని ప్రవక్త లందఱిని విశ్వసింపవలెను. ఎవఁడైన ఒక ప్రవక్తను తిరస్కరించిన చో వాఁడు మతభ్రష్టుఁడై కాఫిరు అగును.

—: తుది దినము (ఖియామత్) :—

విశ్వసింపవలసిన విషయములలో తుది దినము ఒకటి. దానినే ఖియామత్ అనుదురు. అది మానవులును సమస్త జీవులును నశించి లోకము తుదిముట్ట నశించు దినము. ఆ దినమున పర్వతములు దూదివలె చెల్లాచెదరై పోవును. నక్షత్రములు రాలి వడును. సమస్తము నశించును. ఆ దినముననే ఇస్రాఫీలు దూత సూరు అను శంఖము నూదును. దాని భయంకరమైన శబ్దము వలన సమస్త జీవులు నశించును. తుదిదినము వచ్చు సమయము దేవునకే తెలియును. ఇతరు లెవరికిని తెలియదు. అది ఏదో ఒక మొహర్రము నెలలో పదియవ తేదీన శుక్రవారమునాఁడు అగు ననిమాత్రము తెలియును. అది రాఁబోవు కాలమునకుఁ బూర్వము కొన్ని విషయములు సంభవించును. అవి దానిరాఁబోవు గుర్తులు అని హాజ్‌రత్ పైగంబరులవారు ఉపదేశించి యున్నారు. అప్పుడు లోకములో పాపములు విపరీతముగా నగుచు. కుమారులు తమ తల్లి దండ్రుల యాజ్ఞలను మీఱి వారికి చాల కష్టములు పెట్టుదురు. నమ్మిక ద్రోహము చెలరేగును. గానము నృత్యము, వాద్యములు విపరీతములగును. పూర్వీకులైన గొప్ప వారిని వెనుకటివారు దూషింతురు. మూఢులును విద్యాహీనులును మతగురువు లగుదురు. అధములు పెద్ద పెద్ద మేడలు కట్టుదురు. నీచులు ఉన్నతపదవి పొందుదురు. ఈ విషయములు సంభవించునపుడు తుదిదినము సమీపించినది యని తెలియనగును.

—: దేవుని నియామకము (తఖ్దీర్) :—

దేవుఁడు ప్రతి దానిఁగూర్చి ఒక నియామకము నియమించియున్నాఁడు. దాని ననుసరించి ప్రతిది సంభవించును. మేలు కీడు మొదలైనవి ఆ నియామకము ననుసరించియే గలుగును. అవి యన్నియు సంభవింపక పూర్వమే దేవునికిఁ దెలియును. ఎద్దియు ను దేవుని నియామకమునకు మించిపోదు. మానవుఁడుతాను చేయవలసిన యత్నముచేసి తీరవలెను. యత్నము వీడరాదు. దానినే తఖ్దీర్ అనుదురు.

—: పునరుత్థానదినము యౌముల్ హషర్) :—

తుదిదినమై లోకమునశించినపిదప ఇస్రాఫీలుదూత రెండవ తూరి సూరు అను శంఖము నూదును. అపుడు సమస్త మానవులును సజీవులగుదురు. తమతమ కర్మల తీర్పుకై దేవునిసమ్ముఖమున నిలుతురు. ఆ దినమున ప్రజలకర్మల తీర్పు అగును. వారి వారి పాప పుణ్యముల ఫలితము లభించును. ఆ దినమునే యౌముల్ హషర్ (తిరిగిసజీవులై దేవుని సమ్ముఖమున నిలుచుదినము) యౌముల్ హిసాబ్ (తీర్పుచేయఁబడుదినము) యౌముల్ జజా (ఫలితము లభించుదినము) అని యనుదురు. పుణ్యాత్ములు తమ పుణ్యముల ఫలితసౌఖ్యములు పొంది నివసించు చోటును జన్నత్ (స్వర్గము) అనుదురు. పాపాత్ములు తమ పాప ఫలితము ననుభవించి దుఃఖములు పొందు స్థలమును దోజఖ్ (నరకము)అనుదురు.

:— షిర్క్ :—

ఈమాను(విశ్వాసము)ను సంరక్షించుటకై షిర్క్ అను దానిని వదలవలెను. షిర్క్ అనఁగా దేవునికి సాటికల్పించుట. ఇతరులను దేవునితో సమానముగాఁ జేయుట. అది రెండు విధ

ములు. ఒకటి షిర్కుఫిజ్‌జాత్. రెండవది షిర్కుఫిస్ సిఫాత్. షిర్కుఫిజ్‌జాత్ అనఁగా దేవునివలె వేఱు దైవమును కల్పించుట. అట్లు కల్పించువాఁడు ముష్‌రిక్ అనఁబడును. అట్టి వానికిమోక్షమేలేదు. వాఁడు సదా నరక నివాసియగును షిర్కుఫిస్‌సిఫాత్ అనఁగా దేవునికిఁగల శక్తి గుణము (సిఫాతు)లను ఇతరులయందు కల్పించుట. దేవుఁడు స్వరము తెలిసినవాఁడు. అతనికి తెలియనిది యెద్దియును లేదు. అటులే ఇతరులుకూడ స్వరము ఎఱుఁగుదురని విశ్వసించినచో అది షిర్కుఫిల్ ఇల్మి అనఁబడును. దేవుఁడు స్వరశక్తి గలవాఁడు. అతనిశక్తికి మించినది లేదు. సర్వము అతని శక్తి వలననే గలుగుచున్నది. లాభములు నష్టములు సుఖములు, దుఃఖములు సమస్తము దేవుని శక్తి వలననే గలుగుచున్నవి. అటులే ఇతరులును శక్తిగలిగియున్నారని విశ్వసించినచో అది షిర్కుఫిల్ ఖుద్‌రత్ అనఁబడును. దేవుఁడు సమస్తము దగ్గరనున్నను దూరముననున్నను వినుచున్నాఁడు. అటులే ఇతరులు వినుదురని విశ్వసించిన అది షిర్కుఫిస్ సమ్ఇ, అనఁబడును. దేవుఁడు స్వరము చూచుచున్నాఁడు. ఎద్దియును అతని చూపులకు మఱుఁగులేదు. అటులే ఇతరులు కూడ చూచెదరు అని నమ్మిన అది షిర్కుఫిల్ బసర్ అనఁబడును. దేవుఁడు (అల్లాః) పూజ్యుఁడు. అతనినే యారాధింపవలెను. అతనివలె ఇతరులను ఆరాధించినచో అది షిర్కుఫిల్ ఇబాదత్ అనఁబడును. కావున భక్తులు అన్నివిధముల షిర్కుతో పవిత్రులై యుండవలెను. తమ ప్రతిస్థితిలో దేవునినే ధ్యానించి దేవుని సాహాయ్యము వేఁడవలెను. అతని యొద్దనే మొఱలిడవలెను. అతనినే పూజింపవలెను.

—:బిద్ అత్:—

బిద్ అత్ అనఁగా ఇస్లామ్‌మతములో లేనిద్దానిని క్రొత్తగా కల్పించుకొని దానిని ధర్మముగా నెంచి చేయునాచారము. దానికి శాస్త్ర ప్రమాణముండదు. అది ఇస్లామ్ మతమునకు చేరినదికాదు. కావున ఘోర పాతకము. అది చాల దుష్కర్మము. దానివలన పాపము లభించును. హజ్రత్ పైగంబరుల వారు బిద్అతను రద్దుచేసినారు. బిద్అతును ప్రచురించువారును కనిపెట్టువారును మతధర్మ వినాశకులు. బిద్అత్ దుర్మార్గము. అది నరకమునకుఁ గొనిపోవు మార్గము. కావున అట్టి దురాచారములను భక్తులు మానుకొనవలెను.

—: (మహా పాపములు) :—

ఘోరపాతకము (గునాహెకబీరా) లను విశ్వాసములు ముస్లిములు) వదలవలెను. పాతకములు వదులుటవలన విశ్వాస తేజస్సు ప్రజ్వలించును. అట్లుగాక పాతకములు చేసినచో విశ్వాసముమందగిల్లును. అట్టివానిని ఫాసిఖ్ అనుచురు. అన్యాయముగానరహత్య చేయుట, పరులను హింసించుట, వ్యభిచారము చేయుట, దొంగలించుట, నిందలేని స్త్రీ పురుషులపై అపనింద మోపుట, యుద్దములో వీఁపునిచ్చి పాఱిపోవుట, జాల విద్య (జాదూ) చేయుట, అన్యాయముగా తండ్రిలేనిబిడ్డల సొమ్ము తినివేయుట, కల్లుసారాయి త్రాగుట, పందిమాంశము తినుట, వడ్డివ్యాపారముచేయుట, జూదమాడుట, మగవానితో సంభోగించుట, తూనిక కొలతలలో మోసగించుట, పరాయి సొమ్ము బలవంతముగా అపహరించుట, దారి కొట్టుట, అబద్ధమాడుట, చాడీలు చెప్పుట, తిట్టుట నమ్మిక ద్రోహము

చేయుట, సాక్ష్యమును దాచుట, తల్లిదండ్రులను హింసించుట వారిమాట వినకపోవుట, బంధుత్వమును తెంపుట, భార్య, భర్త మాట వినకపోవుట, ముస్లిములపై అనుమానపడుట (గుమానీ చేయుట) వంశగోత్రములపై డంబాలు కొట్టుకొనుట, పరుల గోత్రవంశములను నిందించుట, కష్టములు పడినపుడు కేకలు వేసియేడ్చుట, తలకొట్టుకొనుట, గుడ్డలు చింపుకొనుట, వాద్యములు వాయించుట, ఆడినమాట తప్పుట, పరులు మెచ్చుటకై ప్రార్థన చేయుట, ఖురానెషరీఫు నేర్చుకొనిన పిదప మరచిపోవుట, నమాజును విడిచిపెట్టుట, రమజానునెల యుపవాసములు వదలుట, శక్తి గలిగియు జకాతుదానము ఇయ్యకుండుట. శక్తిగలిగియు కాబాయాత్ర (హాజ్) చేయకుండుట, గడ్డము గొరుగుట, వృథా ఖర్చుచేయుట, నాటకములు మొదలైన ఆటలు చూచుట, అనునవి ఘోర పాతకములు. పాపమును చేసినవారు పశ్చాత్తాప పడి దేవునిని క్షమించుమని వేడుకొన్నచో పాపములు హరించును పరుల హక్కుల విషయము పాపముచేసిన పరుల హక్కు పూర్తి చేయువలెను. లేక హక్కుదారుల క్షమాపణవేడి మన్నన పొందవలెను.

—: నమాజు :—

నమాజు అనఁగా దేవుని ప్రార్థన. దానినే అరబీ భాషలో సలాత్ అనుదురు. ఇది ఇస్లామ్ ముఖ్యధర్మములలో నొకటి. దిని పద్ధతి నియమములు దేవుఁడు తన భక్తులకుఁ దెలిపెను. హజ్రత్ పైగంబరులవారు నమాజుచేసి దాని పద్ధతిని సంపూర్ణముగాఁ దెలిపిరి. నమాజును గూర్చి దేవుఁడు ఖురానెషరీఫులో చాల తాకీదు చేసియున్నాఁడు. ఇది దేవునికి చాల ప్రియమైనది.

ప్రతిదినము అయిదు పూటలు సలుపవలెను. ఇది స్త్రీలకు పురుషులకు తప్పని ధర్మము. దానిని వదలువారు పాపాత్ములగుదురు. నమాజు ధర్మము కాదు అని తిరస్కరించువారు విశ్వాసహీను (కాఫిరు) లు అగుదురు. ముస్లిములను ఇతరులను వేఱుచేయునట్టి గుర్తు నమాజు. నమాజు చేయని ముస్లిములు తమ మత ధర్మమును విడిచిన వారగుదురు. నమాజు ఈమానునకు గుర్తు. కావున ప్రతి ముసల్మానుఁడును నమాజు చేయుటయందు శ్రద్ధ గలిగి యుండవలెను. నమాజు సలుపుటచే భక్తుల పాపములు పోవును. ఆత్మ శుద్ధి లభించును. దీనిచే మోక్షము చేకూరును.

: నమాజు షరతులు :—

నమాజు చేయుటకు ముందు కొన్ని విషయములు కావలెను. అవి లేనిది నమాజు పూర్తి కాదు. అట్టివి ఏడు గలవు. వానినే షరతులు అనుదురు. మొదటిది నమాజు చేయువారి దేహము పరిశుభ్రముగా నుండవలెను. రెండవది ధరించిన వస్త్రములు పరిశుభ్రముగా నుండవలెను. మూఁడవది నమాజు చేయుస్థలము పరిశుభ్రముగా నుండవలెను. నాలుగవది దేహమును కప్పుట. అయిదవది నమాజువేళ. ఆఱవది ఖిబ్లా (కాబా మసీదు ఉండు దిక్కు) వైపు ముఖము చేయుట. ఏడవది నమాజు కొఱకు సంకల్పము (నియ్యత్) చేయుట.

దేహము మలమూత్రములు నెత్తురు చీము మొదలైన మలినముల నుండి పరిశుభ్రముగా నుండవలెను. వస్త్రములు కూడ అట్టి మలినమునుండి పరిశుభ్రముగా నుండవలెను. స్థలము కూడ మలినము లేకుండ శుద్ధిగా నుండవలెను. ధరించు వస్త్రము పురుషులకు నాభి నుండి మోఁకాళ్ల క్రింది వఱకుండవలెను.

అంతభాగము పురుషులు తప్పక కప్పుకొన వలసినది. అందలి దేహము కనఁబడిన నమాజుకాదు. దానినే సతరె ఔరత్ అనుదురు. స్త్రీలు, ముఖము మనికట్టు చేతులు పాదములు తప్ప మగిలిన పూర్తి దేహము దుస్తులతో కప్పుకొనవలెను. పురుషులు కూడ నమాజులో మిగిలిన దేహమునందు వస్త్రము ధరించుట శ్రేష్ఠమైనది.

—: వజూ :—

దేహశుద్ధికొఱకు నమాజునకు పూర్వము వజూ చేయ వలెను. వజూ చేయుటకై పరిశుభ్రమైన ఎత్తుస్థలముపై కూర్చుండి పరిశుభ్రమైన నీళ్లు తీసికొని బిస్మిల్లాహి-వల్ హమ్దు-లిల్లాహి అని పలికి చేతులు మనికట్టువఱకు మూఁడుతూర్లు కడుగవలెను. పిదప మూఁడుతూర్లు నీళ్లు పుక్కిలించి నోరు శుద్ధి చేయవలెను. తరువాత మూఁడు పర్యాయములు ముక్కులో నీళ్లుపీల్చి ముక్కు శుద్ధి చేయవలెను. ఆ పిదప నొసటి వెండ్రుకలనుండి గడ్డమువఱకు ముఖము మూఁడుతూర్లు కడుగవలెను. దాని తరువాత కుడిచేతిని ఎడమచేతిని వరుసగా మోఁచేతులవఱకు మూఁడుతూర్లు కడుగ వలెను. పిదప తలను మెడను చెవులను నీళ్లతో తుడుచుకొన వలెను. దానినే మసా అనుదురు. దాని తరువాత కుడి పాదమును ఎడమపాదమును వరుసగా చీలమండల వఱకు మూఁడు తూర్లు కడుగవలెను. అవసరమున్నచో వజూచేయుటకు ముందే మల మూత్ర విసర్జనము కావించి శుద్ధి చేసికొనవలెను. వాని తొందఱ గలిగినపుడు నమాజులో ప్రవేశించుట మంచిదికాదు.

—: శౌచము (ఇస్తిన్‌జా) :—

ఒంటికి రెంటికిఁగాను మఱుఁగు చోటికి పోవలెను.

దొడ్డికి పోవుటకు ముందుగా అల్లాహుమ్మ - ఇన్నీ -అ ఊజు - బిక మినల్ - ఖుబ్ సి - వల్ - ఖబాఇసి అని చదువలెను. ఒంటికి రెంటికి కూర్చుండునపుడు ఖిబ్లావైపున ముఖముగాని వీఁపుగాని చేయ కూడదు. మలమూత్ర శుద్ధికిఁగాను శుభ్రమైన మట్టిబెడ్డలతోఁ గాని రాళ్లతోఁగాని ముందు శుద్ధిచేసిన పిదప నీళ్ళతో శుద్ధి చేయవలెను, శుద్ధికిఁగాను ఎడమచేతిని ఉపయోగించవలెను. శుద్ధి చేసికొనిన పిదప ఎడమచేతిని మట్టితో రుద్ది కడుగవలెను. శుద్ధి ముగించి బయటికి వచ్చిన పిదప అల్ హమ్దు - లిల్లా - హిల్లజీ - అజ్ హాబ - అన్నిల్ -అజా - వ ఆఫానీ అని చదువవలెను. శుద్ధిచేయు టకుఁగాను ఎముకలు గాజు ముక్కలు లద్ది పేడ బొగ్గు గుడ్డలు కాగితములు తినుపదార్థములు మొదలైనవి యుపయోగించ కూడదు. ఒంటికి రెంటికి కూర్చుండునపుడు ఎవరితోను మాట లాడకూడదు. మైదానములలో కూర్చుండి ఒకరితో నొకరు మాటలాడుట చాల అసహ్యము. దానిచే దేవుని కోపమునకు అట్టివారు పాత్రులగుదురు.

వజూ చేసికొన్న పిదప మలమూత్ర విసర్జనము గాని పిత్తు గాని నిద్రపోయినగాని దేహమునుండి నెత్తురు చీము ప్రవహించిన గాని మూర్ఛ పిచ్చి చెందినగాని నమాజులో పకపకమని నవ్విన గాని క్రక్కుకొనినగాని తిరిగి వజూచేయవలెను. వానినే నవా ఖజెవజూ (వజూ వలని శుద్ధిని పోఁగొట్టునవి) అనుదురు

—: గుసులు :—

అవసరమున్నచో నమాజునకు పూర్వము గుసులు (స్నా నము) చేసికొనవలెను. స్త్రీ పురుషులు కలిసినపుడును, ఋతు కాలము పూర్తియైన పిదపను స్వప్నమందు రేతస్ఖలనము (ఇహ్తె

లామ్) అయినపుడును పురుడు తీరినపుడును తప్పక గుసులు చేసి తీరవలెను. గుసులు చేయుటకు ముందు మనికట్లు వఱకు చేతులు కడుగుకొనవలెను. పిదప మలమూత్ర శుద్ధి గావించుకొని దేహమందున్న మలినము రుద్ది కడుగవలెను. దానిపిదప అగ్ తసిలు — లిరఫ్ ఇల్ హదసి (అశుద్ధిని తొలగించుటకై స్నానము చెయుచున్నాను) అని పలికి పైన వ్రాసిన పద్ధతిగా వజూ చేయవలెను. దాని పిదప దేహమంతటను రుద్ది నీళ్లతో కడుగవలెను. దేహమంతటను బాగుగ తడిపిన పిదప తలపైనను కుడి ఎడమ భుజములపైనను వరుసగా మూఁడు చెంబుల నీళ్లను పోసికొనవలెను. స్నానము చేయుస్థలము ఎత్తుగానుండి మురికి నీళ్లు దూరముగా పోవునట్లుగ నుండవలెను.

దేహములో గాయము పుండ్లుండినచో వజూ గుసులు నీళ్ళతో చేసిన అపాయము కలుగునను భయముండినచో గాయములమీఁది కట్టు లేక పట్టిపైన తడి చేతితో తుడిచిన చాలును. కట్టు లేకుండి గాయమునకు తడిచేతితో తుడిచిన అపాయము లేనిచో గాయము పుండు మీఁదనే తడిచేతితో తుడువవలెను. అపాయము లేనిచో నీళ్ళతో కడిగి తీరవలెను.

—: నీళ్లు :—

వజూ గుసులు చేయుటకై పరిశుభ్రమైన నీళ్ళు ఉపయోగింపవలెను. ప్రవహించు నీళ్ళు పరిశుభ్రమైనది. చెఱువులు, సముద్రములు, నదులు, గుంటలు, బావులు మొదలైన వాని నీళ్ళు పరిశుభ్రమైనది. వాని నీళ్ళు ఉపయోగింపఁదగినవి.

—: బావిశుద్ధి :—

బావులలో మలమూత్రములు మొదలైన మలినములు

పడిన లేక ఏదైన ప్రాణి దానిలో పడి చచ్చినచో బావుల నీళ్ళు అపవిత్రమగును. బావిశుద్ధిచేసిన పిదప దానినీళ్ళు ఉపయోగింప వలెను. బావిశుద్ధిచేయుటకై మలినములు పడినచో దానిలోని నీళ్ళంతయు తీసివేయవలెను. మనుష్యుఁడు గాని పందిగాని కుక్కగాని మేఁకగాని ఏదైన ఇతర జంతువు పై వాని వంటిది గాని వానికన్న పెద్దదిగాని బావిలో పడి చచ్చినచో బావి నీళ్ళంతయు తీసివేయవలెను. అపుడు బావి శుద్ధియగును. దాని తరువాత వచ్చు నీళ్ళు ఉపయోగింపవచ్చును. ఏదైన జంతువు చిన్నదిగాని పెద్దదిగాని బావిలో పడిచచ్చి ఉబ్బిన లేక పగి లిన బావి నీళ్ళంతయు తీసివేయవలెను. అపుడు బావి శుద్ధి యగును. పావురముగాని కోడిగాని పిల్లిగాని ఏదైన ఇతర జంతువు పై వానివంటిదిగాని బావిలో పడి చచ్చి ఉబ్బకున్నచో నలువది లేక అఱువది చేఁదలనీళ్ళు తీసివేయవలెను. ఎలుకగాని పిట్టగాని లేక వానివంటిది ఇతర జంతువులుగాని బావిలో పడి చచ్చి ఉబ్బకున్నచో ఇరువది ముప్పది చేఁదల నీళ్ళు తీసి వేసిన బావి నీళ్ళు శుద్ధియగును. దాని పిదప వజూ గుసులు త్రాగుట మొదలైన పనులకు నీళ్ళుపయోగింపవచ్చును. నీళ్ళలో పుట్టి పెరుఁగు చేపలు కప్పలు వంటివి బావులలో చనిపోయిన నీళ్ళు అశుద్ధికాదు. బావిశుద్ధి చేయకయే నీళ్ళు ఉపయోగింప వచ్చును. నీళ్ళకొఱకు హౌజు నిర్మించినచో అది అయిదున్నర గజముల పొడవును అయిదున్నర గజముల వెడల్పును ఉండవలెను. అందు వజూ చేయవచ్చును.

—: తయమ్ముమ్ :—

వజూగుసులు చేయుటకై నీళ్ళు ఉపయోగించుటకు వీలు

లేని స్థితిగతులలో నీళ్ళకు బదులుగ పరిశుభ్రమైన మట్టితో శాస్త్రపద్ధతిగా శుద్ధిచేసికొనుటకు తయమ్ముమ్ అని పేరు. రోగపీడితుండు నీళ్ళుపయోగించిన రోగము హెచ్చును. లేక నష్టము గలుగునను భీతియున్నచో తయమ్ముమ్ చేసికొని నమాజు చేయవచ్చును, ప్రయాణములో నున్నపుడు లేక ఊరికి బయట ఒక మైలు దూరమున నున్నపుడు నీళ్ళు దొరకనిచో నమాజు వేళకు ప్రార్థన చేసికొనుటకై తయమ్ముమ్ చేసికొనవచ్చును. తయమ్ముమ్ చేయుటకు ప్రారంభించునపుడు "అతయమ్మము లిరఫ్ఇల్ హాదసి" అనిచెప్పి అశుద్ధిని పోఁగొట్టుటకై యుద్దేశించి పరిశుభ్రమైన నేలపై రెండు చేతులు తట్టి వానిని జాడించి ముఖముపై తుడుచుకొనవలెను. మరల రెండవతూరి చేతులను నేలపై తట్టి వానిని జాడించి మోఁచేతుల వఱకు రెండు చేతులపై తుడుచుకొనవలయును. ఇసుక, రాళ్ళు, సున్నము మొదలైన భూ సంబంధమైన వస్తువులతో తయమ్ముమ్ చేసికొనవచ్చును. వజూ ఏ విషయములచే పోవునో ఆ విషయములతోను, నీళ్ళు ఉపయోగించుటకు శక్తిగలుగుట చేతను తయమ్ముమ్ పోవును.

నమాజెజనాజా బక్రీదు రమజాను పండుగల నమాజుల కొఱకు వజూచేయుటకు నుద్దేశించిన నమాజులు తప్పి పోవునను భీతియున్నచో వజూకు బదులుగా తయమ్ముమ్ చేసికొని ఆయా నమాజులు చేయవచ్చును.

—: నమాజువేళలు :—

ఫజర్, జొహర్, అసర్, మగ్రిబ్, ఇషా, అనునవి అయిదు పూఁటలు నమాజులు. ఫజర్ నమాజువేళ తెల్లవాఱు

నుండి సూర్యోదయము వఱకు. తెల్లవాఱునకు సుబ్హె సాదిఖ్ అనిపేరు. ఫజర్ నమాజులో ముందు రెండు రకాతులు సున్నత్ నమాజుచేసిన పిదప రెండురకాతులు ఫరజ్ నమాజు చేయవలెను. ఫరజ్ నమాజు పిదప సున్నత్ నఫిల్ నమాజు చేయరాదు. జొహర్ నమాజువేళ సూర్యుఁడు వాలినప్పటినుండి ప్రతివస్తువు నీడ రెండింతలు అగుపఱకు. జొహర్ నమాజులో నాలుగు రకాతులు సున్నత్ నమాజుచేసిన పిదప నాలుగు రకాతులు ఫరజ్ నమాజు చేసి దాని పిదప రెండు రకాతులు సున్నత్ నమాజు చేయవలెను. సున్నత్ నమాజు పిదప నఫిల్ నమాజు రెండు రకాతులు చేయవచ్చును. జొహర్ నమాజువేళ ముగిసిన పిదప అసర్ నమాజువేళ ఆరంభమై సూర్యుఁడు అస్తమించు వఱకుండును. అసర్ నమాజులో నాలుగు రకాతులు ఫరజ్ నమాజు చేయవలెను. కోరినవారు ఫరజ్ నమాజునకు ముందు నాలుగు రకాతులు సున్నత్ నమాజు చేయవచ్చును. అసర్‌లో ఫరజ్ .నమాజు చేసిన పిదప సున్నత్ నఫిల్ నమాజు చేయకూడదు. మగ్‌రిబ్ నమాజు వేళ సూర్యుఁడు అస్తమించిన తరువాత ఎఱ్ఱ తెల్లని కాంతులు పోయి చీఁకటి క్రమ్ముకొను వఱకుండును. మగ్‌రిబ్ నమాజులో మూఁడు రకాతులు ఫరజ్ నమాజు చేసిన పిదప రెండురకాతులు సున్నత్ నమాజు చేయవలెను. కోరినవారు ఎన్ని రకాతులైన నఫిల్ నమాజు చేయవచ్చును. మగ్‌రిబ్ నమాజువేళ ముగిసి చీఁకటి క్రమ్ముకొనినప్పటినుండి తెల్లవాఱు వఱకు ఇషానమాజువేళయుండును. ఇషా నమాజులో కోరినవారు ముందు నాలుగు రకాతులు సున్నత్ నమాజుచేసి నాలుగు రకాతులు ఫరజ్ నమాజు చేయవలెను.

దాని పిదప రెండురకాతులు సున్నతు నమాజుచేసి ఇష్టపడిన వారు రెండు రకాతులు నఫిల్ నమాజుచేసి మూఁడు రకాతులు వాజిబ్ వితరు నమాజు సలుపవలెను. వితరు నమాజు చేసిన తరువాతకూడ నఫిల్ నమాజు చేయవచ్చును. సూర్యుఁడు ఉదయించునపుడును సూర్యుఁడు తలమీఁద (మిట్ట మధ్యాహ్నమున) నున్నపుడును సూర్యుఁడు అస్తమించునపుడును నమాజు గాని సజ్దాగాని చేయరాదు.

—: అజాను :—

అయిదు పూఁటలు ఫరజ్ నమాజు కొఱకును శుక్రవారపు నమాజుకొఱకును "అజాను" ఇయ్యవలెను. అజాను అనఁగా నమాజుకొఱకు పిలుచుట.* 1అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్. అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్. 2 అష్హదు_ అల్ లాఇలాహ_ఇల్_లల్లాహ్, అష్హదు_అల్ _ లాఇలాహ_ఇల్ లల్లాహ్. 3 అష్హదు అన్న-ముహమ్మదర్ రసూలుల్లాహ్.అష్ హదు-అన్న ముహమ్మదర్ రసూలుల్లాహ్. 4 హయ్యా_అలస్_ సలాత్. హయ్యాఅలస్_సలాత్ [ఇది చెప్పునపుడు ముఖము కుడి ప్రక్కకు త్రిప్పవలెను. ) హయ్యా అలల్-ఫలాహ్-హయ్యా అలల్ ఫలాహ్ (ఇది చెప్పునపుడు ముఖము ఎడమ ప్రక్కకు త్రిప్ప వలెను.) అల్లాహు అక్బర్-అల్లాహు అక్బర్. లాఇలాహ_ఇల్_ లల్లాహ్. ఈ వాక్యములు ప్రతి నమాజు వేళలో ఎత్తుస్థలమున

* (1) అల్లాః సర్వాధికుఁడు (2) అల్లాః దప్ప వేఱు పూజ్యుఁడు లేఁడని నేను సాక్ష్యమిచ్చుచున్నాను. (3) హజ్రత్ ముహమ్మదువారు దేవుని ప్రవక్త అని నేను సాక్ష్యమిచ్చుచున్నాను. (4) నమాజుకొఱకురండు (5) మోక్షము పొందుటకు రండు.

నిలిచి చెవులలో చూపుడు వ్రేలుదూర్చి బిగ్గరగా చెప్పవలెను. నమాజె ఫజరులో మాత్రము హయ్యా అలల్ ఫలాహ్ చెప్పిన తరువాత అస్‌సలాతు_ఖైరుమ్_మినన్_నౌమ్. అస్ సలాతు_ఖైరుమ్ మినన్_నౌమ్_అని చెప్పవలెను. దాని అర్థము:_ నిద్ర కన్న నమాజు మేలైనది.

అజాను వినువారు కూడ నిశ్శబ్దముగా అజానువాక్యములను పఠింపవలెను. హయ్యా అలస్ సలాత్-మఱియు హయ్యా అలల్ ఫలాహ్ వినునపుడు లాహౌల_వలా_ఖువ్వత_ఇల్లాబిల్లాహి అని చెప్పవలెను. ఫజరునమాజులలో అస్ సలాతు-ఖైరుమ్ మినన్‌నౌమ్-వినునపుడు సదఖ్‌త-వబరిర్త అని చెప్ప వలెను. అజాను ముగిసిన పిదప ఈదుఆ చేయవలెను. అల్లాహుమ్మ రబ్బహాజియిద్_దా వతిత్ తామ్మతి వస్‌సలాతిల్ ఖాయి మతి_ఆతి_ముహమ్మదనిల్_వసీలత_వల్-ఫజీలత-వబ్-అస్ హు-ముఖామమ్ మహ్_మూదనిల్లజీ_వఅత్తహూ. ఇన్నక_లాతుఖ్ లిఫుల్_మీఆద్.

ఇఖామత్ :_ ఫరజ్ నమాజు చేయుటకై సిద్ధమై నిలుచునపుడు అజానువాక్యమును తిరిగి పలుకవలెను. అయితే హయ్యా అలల్ ఫలాహ్ తరువాత ఖద్ ఖామతిస్ సలాత్. ఖద్‌ఖామతిస్_సలాత్ అని పలుకవలెను. ఇఖానుత్ చెప్పునపుడు చెవులలో వ్రేళ్ళుంచుకొన కూడదు.

నమాజు చేయు పద్ధతి వ్రాయుటకు ముందు అందు పఠింపఁబడు విషయముల నిచట వ్రాయుదుము.

తక్బీరు_అల్లాహు అక్బర్.

సనా:_సుబ్_హానక_ల్లాహుమ్మ_వబి హమ్దిక_వతబారక
స్మక_వతఆలా_జద్దుక_వలా_ఇలాహ_గైరుక్.
తఅవ్వుజ్:_అఊజు_బిల్లాహి_మినష్_షైతా_నిర్రజీమ్.
తస్మియా:_బిస్మిల్లా_హిర్రహ్మా_నిర్రహీమ్.
సూరయే ఫాతిహా:_ అల్ హమ్దు_లిల్లాహి_రబ్బిల్_ఆలమీన్
అర్రహ్మా_నిర్రహీమ్. మాలికి యౌమిద్దీన్. ఇయ్యాకన అబుదు
వఇయ్యాకన స్తఈన్_ఇహ్దినస్_సిరాతల్_ము స్తఖీమ్. సిరా
తల్_లజీన_అన్_అమ్త_అలై_హిమ్_గైరిల్_మగ్జూబి_అలై
హిమ్_వలజ్_జాల్లీన్. (ఆమీన్.)
సూరయేఫీల్:_ బిస్మిల్లా హిర్రహ్మా_నిర్రహీమ్. అలమ్
తర_కై ఫ_ఫఅల_రబ్బుక_బిఅస్_హాబిల్_ఫీల్. అలమ్_యజ్-
అల్_కై దహుమ్_ఫీ_తజ్‌లీల్. వఅర్‌సల_అలై హిమ్_తైరన్
అబాబీల్. తర్ మీహిమ్_బిహిజా_రతిమ్ మిన్_సిజ్జీల్. ఫజ
అలహుమ్_కఅస్ ఫిమ్_మాకూల్.
సూరయేఖురై ష్:_ బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్. లిఈలాఫి_
ఖురై షిన్_ఈలా_ఫిహిమ్_రిహ్లతష్_షితాఇ_వస్ సైఫ్_ఫల్
యఅ బుదూ_రబ్బ_హాజల్_బై తిల్_లజీ_అత్_అమహుమ్
మిన్ జూఇన్ వఆమన_హుమ్_మిన్ ఖౌఫ్.
సూరతుల్ మాఊన్:_ బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్. అర - ఐ

తల్_ల జీయుక జ్జిబు-బిద్దీన్-ఫజాలి_కల్ల జీ_యదు అ్_ఉల్
యతీమ_వలాయహుజ్జు-అలా-త-ఆమిల్_మిస్కీన్ - ఫవైలుల్
లిల్-ముసల్లీ-నల్లజీన_హుమ్_అన్_సలాతిహిమ్ - సాహూన్. అ
ల్లజీన-హుమ్_యురాఊన_వయమ్_న_ఊనల్_మా ఊన్.

సూరయే కౌసర్:_ బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్. ఇన్నా అ్అ
తైనా_కల్_కౌసర్_ఫసల్లి_లిరబ్బిక_వన్ హార్-ఇన్న - షాని-
అక_హువల్_అబ్తర్.

సూరయేకాఫిరూన్:_ బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్. ఖుల్
యా-అయ్యు_హల్_కాఫిరూన_లా_అ్అ బుదు_మాత అ్బు
దూన_వలాఅన్తుమ్_ఆబిదూన-మాఅ్అ బుద్_వలా_అన_ఆబి
దుమ్_మా_అబత్ తుమ్_వలా అన్తుమ్_ఆబిదూన_మాఅ్అ
బుద్_లకుమ్ దీనుకుమ్_వలియ_దీని.

సూరయేనస్ర్:_బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్. ఇజా _ జాఅ
నస్రుల్లాహి_వల్_ఫత్ హు_వర_ఐతన్_నాస-యద్ ఖులూన.
ఫీ- దీనిల్లాహి_అఫ్వాజన్ ఫసబ్బి హ్_బి హమ్ది_రబ్బిక-వస్తగ్
ఫిర్హు_ఇన్నహూ_కాన_తవ్వాబా.

సూరయేలహబ్:_ బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్. తబ్బత్
యదా_అబీ-లహబిన్_వతబ్బ-మాఅగ్నా-అన్హు-మాలుహూ
వమా-కసబ్. సయస్లా-నారన్-జాత లహబిన్ _ వమ్ రఅ తు

హూ - హేమ్మా-లతల్-హే త బి_ఫీజీదిహా_హేబ్_లుమ్_మిమ్ మసద్.

సూరయే ఇఖ్‌లాస్:— బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్. ఖుల్ హువల్లాహు_అహేద్. అల్లాహుస్_సమద్. లమ్ _ యలిద్. వలమ్-యూలద్. వలమ్_యకుల్_లహూ_కుఫువన్ _అహేద్.

సూరయే ఫలఖ్:— బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్. ఖుల్ అఊజు_బిరబ్బిల్ ఫలఖి_మిన్_షర్రిమా_ఖలఖ్. వమిన్_షర్రిగాసిఖిన్ ఇజా_వఖబ్. వమిన్_షర్రిన్_నఫ్ఫా_సాతి_ఫిల్_ఉఖది-వమిన్ షర్రి_హాసిదిన్_ఇజా హసద్.

సూరయేనాస్:— బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్. ఖుల్_అ ఊజు బిరబ్, బిన్నాసి_మలి-కిన్నాసి_ఇలా_హిన్నాసి_మిన్_షర్రిల్-వస్_వాసిల్_ఖన్నా_సిల్ల జీ_యువస్_విసు_ఫీ,సుదూ_రిన్నాసి మినల్_జిన్నతి_వన్నాస్.

తస్ బీహేరుకూ:— సుబ్ హాన రబ్బియల్ అజీమ్.

తస్మీ:— సమి_అల్లాహు_లిమన్_హామిదహ్.

తహ్మీద్:— రబ్బనా లకల్ హమ్దు.

తస్బీహేసజ్దా:— సుబ్ హాన రబ్బియల్ అఅలా.

అత్తహియ్యాత్:— అత్_తహియ్యాతు_లిల్లాహి_వస్_సలవాతు_వత్_తయ్యి_బాతు_అస్సలాము_అలైక_అయ్యు -

హ్-నబియ్యు_వరహ్మతుల్లాహి_వబరకాతుహు - అస్సలాము-అలైనా - వ అలా-ఇబాదిల్లా - హిస్-సాలి హీన్-అష్-హదు - అల్ - లాఇలాహ - ఇల్ - లల్లాహు - వ-అష్ - హదు-అన్న-ముహమ్మదన్ - అబ్దుహూ - వ రసూలుహూ,

దరూదెఇబ్రాహీమ్:= అల్లాహుమ్మసల్లి అలా ముహమ్మదిన్ వఅలా - ఆలి - ముహమ్మదిన్ - కమా సల్ లైత-అలా-ఇబ్రాహీమ-వఅలా-ఆలి ఇబ్రాహీమ - ఇన్నక - హమీదున్ - మజీద్ అల్లాహుమ్మ - బారిక్ - అలా - ముహమ్మదిన్-వ-అలా-ఆలి-ముహమ్మదిన్ - కమా - బారక్త-అలా-ఇబ్రాహీమ-వ - అలా-ఆలి-ఇబ్రాహీమ - ఇన్నక - హమీదుమ్ - మజీద్.

దుఆయెమాసూరా:= అల్లాహుమ్మ - ఇన్నీ జలమ్తు-నఫ్సీ-జుల్మన్-కసీరన్ - వఇన్నహూ - లాయగ్ - ఫిరుజ్-జునూబ-ఇల్లా - అన్త-ఫగ్-ఫిర్-లీ- మగ్ఫిరతమ్-మిన్ -ఇన్ - దిక - వర్ - హమ్నీ ఇన్నక - అన్తల్ - గఫూరుర్ - రహీమ్.

సలామ్:= అస్ - సలాము. అలైకుమ్ - వరహ్మతుల్లాహ్.

నమాజు తరువాత చేయఁబడు దుఆ=అల్లాహుమ్మ-అన్తస్-సలాము - వమిన్_కస్_సలాము_తబారక్త_యాజల్_జలాలి-వల్_ఇక్రామ్.

దుఆయెఖునూత్ := అల్లాహుమ్మ–ఇన్నా–నస్-త ఈనుక–వనస్

తగ్ _ఫిరుక_వనూమిను_బిక-వనత-వక్కలు_అలైక-వనున్హి_అలైకల్ - ఖైర_వనష్_కురుక_వలా_నక్_ఫురుక_వనఖ్_లఊ-వనత్_రుకు_మైయఫ్_జురుక_అల్లాహుమ్మ_ఇయ్యాక-నఅబుదు_వలక_నుసల్లీ-వనస్ జుదు-వఇలైక_నస్ ఆ వనహ్ ఫిదు-వనర్ జూ-రహ్మతక_వనఖ్ షా_ అజాబక-ఇన్న_అజాబక _ బిల్_కుఫ్_ఫారి_ముల్ హిఖ్.

ఆయతుల్ కుర్సీ:— అల్లాహు-లాఇలాహ-ఇల్లా - హువల్ - హయ్యుల్_ఖయ్యూము లాతాఖుజుహు_సిన_తున్-వలానౌమున్ లహూ-మాఫిస్ - సమావాతి - వమాఫిల్ - అర్జి మన్- జల్_లజీయష్ఫ ఊ- ఇన్దహు - ఇల్లా - బిఇజ్నిహీ-య అలము - మాబైన-ఐదీహిమ్వమా - ఖల్ - ఫహుమ్-వలా - యుహీతూన-బిషైయిమ్-మిన్ - ఇల్మిహీ-ఇల్లా బిమా - షాఅ-వసిఅ_కుర్-సీయుహుస్సమా- వాతి వల్-అర్ జ_ వలా-యఊదుహూ. హిఫ్ జుహుమా_వహువల్_అలీ యుల్-అజీమ్.

ఖూరానెషరీఫులోని దుఆ:— రబ్బనా ఆతినా- ఫిద్-దున్యా-హసనతన్ - వఫిల్ ఆఖిరతి-హసనతన్ - వఖినా అజాబన్నార్.

—: నమాజుచేయు పద్ధతి (తర్కీబు) :—

నమాజుచేయుటకు పూర్వము దేహము, వస్త్రము స్థలము పరిశుభ్రముగా నుంచుకొనవలెను. అవసరమున్నచో

స్నానము (గుసులు) చేయవలెను. లేక యథా ప్రకారముగా వజూచేసి కాబామసీదుండు దిక్కు ముఖముచేసి భయభక్తులతో నిలిచి ఏనమాజు చేయవలసియుండునో దానినుద్దేశించి (నియ్యతు చేసి) అల్లాహు అక్బరు అని చెప్పుచు చేతులు చెవులవఱకు నెత్తి నాభిక్రింద ఎడమచేతినుంచి దానిపై కుడిచేతి నుంచవలెను. (స్త్రీలు చేతులను ఱొమ్ముపై కట్టుకొనవలెను.) దాని పిదప సనా, తవ్వూజు, బిస్మిల్లాః చదివి సూరయేఫాతిహాతో ఇంకొక సూరాచేర్చిపఠింపవలెను. ప్రతిసూరాకు మునుపు బిస్మిల్లాః చదువుట మంచిది. ఇట్లు నిలిచి పఠించుటను ఖియామ్ అనుదురు. సూరాలు పఠించిన పిదప అల్లాహు అక్బరు అనిపలుకుచు చేతులు విడిచి వంగి చేతులను మోఁకాటి చిప్పలపై నుంచి 3 లేక 5 తూర్లు సుబ్ హాన-రబ్బియల్ అజీమ్ అనిచదువవలెను. దీనినే రుకూ అనుదురు.) ఆపిదప సమి అల్లా-హు లిమన్ హామిదహ్ అనిపలుకుచు తలనెత్తి నిలచిన పిదప రబ్బనా- లకల్ హామ్దుఅని పలుకవలెను. (దీనినే ఖౌమా అనుదురు) దాని పిదప అల్లాహు అక్బరు అని పలుకుచు ముందునేలపై మోఁకాళ్లనుంచి దానిపిదప చేతులనుంచి నొసటిని ముక్కును నేలపైనుంచి 3 లేక 5 తూర్లు సుబ్ హాన రబ్బియల్ ఆలా యని పఠించవలెను. (దీనినే సజ్దా అనుదురు.) దాని పిదప అల్లాహు అక్బరు అనిచెప్పుచు సజ్దానుండి లేచి కూర్చుండవలెను. (దీనినే జల్సా అనుదురు.) మరల అల్లాహు అక్ బరు అనుచు మొదటివలె రెండవ సజ్దాచేసి అల్లాహు అక్బరు అనుచు తలను, మోఁచేతులను, మోఁకాళ్లను, వరుసగా నెత్తుచు నిలువవలెను. ఇదియంతయు ఒకరకాతు అనఁబడును. మరల బిస్మిల్లాః చదివి సూరెఫాతిహాతో మఱొక సూరాచేర్చి చదివి

అల్లాహు అక్బరు అని చెప్పుచు వంగి రుకూ చేసి అందు 3 లేక 5 తూర్లు సుబ్ హాన రబ్బియల్ అజీమ్ చదివి, సమిఅల్లాహు లిమన్ హమిదహ్ అని చెప్పుచు సరిగా నిలిచి రబ్బనాలకల్ హమ్దు అని చెప్పవలెను. దానిపిదప అల్లాహు అక్బరు అని చెప్పుచు మొదటిరకాతులో చేసినట్లు రెండు సజ్దాలు చేసి కూరుచ్ండి అత్తహియ్యాతు చదువవలెను. అందు లాఇలాహాఇల్ లల్లాహు పఠించునపుడు, చూపుడు వ్రేలు నెత్తిసైగ చేయ వలెను. పిదప దరూదెఇబ్రాహీము మఱియు దుఆయె మా సూరా చదువవలెను. దినినే ఆఖరీ ఖాదా అనుదురు. పిదప అస్సలాము అలైకుమ్ — వరహ్మతుల్లాహి అని చెప్పుచు కుడి ప్రక్కకు ముఖముత్రిప్పి తిరిగి అస్సలాము అలైకుమ్ వరహ్మతు ల్లాహి అనుచు ఎడమవైపునకు ముఖముత్రిప్పి నమాజు ముగింప వలెను. ఇంతవఱకు జరిగినది రెండు రకాతుల పద్ధతి. నమాజు పిదప ఆయతుల్ కుర్సీ చదివి సుబ్ హానల్లాహి, అల్ హమ్దులిల్లాహి 33 తూర్లును అల్లాహు అక్బరు 34 సార్లు చదివి రెండు చేతుల నెత్తి దుఆచేయవలెను.

—:మూడు నాలుగు రకాతులు నమాజు చేయుపద్ధతి:—

మూడు నాలుగు రకాతుల నమాజు చేయవలెనన్న పైని వివరించిన రెండు రకాతుల నమాజు పద్ధతి ప్రకారము చేసి అత్తహియ్యాతులో "అబ్దుహూవరసూలుహు" వఱకు చదివిన పిదప అల్లాహు అక్బరు అని పలుకుచు లేచి నిలిచి బిస్మిల్లాహి, సూరెఫాతిహాతో, మఱియొక్క సూరా చేర్చి చదివి అల్లాహుఅక్బరు అని పలుకుచు రుకూ చేసి 3 లేక 5 తూర్లు సుబ్ హాన రబ్బియల్ అజీమ్ అని పఠించుచు, సమి

అల్లా హులిమన్ హామిదహ్ అనిపలుకుచు లేచి నిలిచి రబ్బ నాలకల్ హమ్దు అని చెప్పి అల్లాహు అక్బరు అనుచు యథా ప్రకారము రెండు సజ్దాలుచేసి తిరిగి అల్లాహు అక్బరుఅనుచు లేచి నిలిచి బిస్మిల్లాః సూరెఫాతిహాతో మఱొక సూరాను చేర్చి పఠించి యథా ప్రకారముగా రుకూచేసి రెండు సజ్దాలు చేసి కూర్చుండి అత్తహియ్యాతు దరూదె ఇబ్రాహీమ్ దుఆయె మాసూరా పఠించి అస్ సలాము అలైకుమ్ వరహ్మతుల్లాహి అని పలుకుచు కుడి ఎడమ ప్రక్కలకు ముఖమును త్రిప్పి నమాజు ముగింపవలెను. సున్నత్, నఫిల్ నమాజులలో మాత్రము నాలుగు రకాతులలోను సూరెఫాతిహాతో మఱొక సూరా చేర్చి చదువవలెను. ఫరజ్ నమాజులో మొదటి రెండు రకాతులలో మాత్రము సూరెఫాతిహాతో మఱొకసూరా చేర్చి చదువవలెను. మిగిలిన మూఁడవ నాలుగవ రకాతులలో సూరెఫాతిహా మాత్రము చదివి రుకూ చేయువలయును. సున్నత్ నఫిల్ నమాజులలో సూరెఫాతిహా మఱి యితర సూరాలు నిశ్శబ్దముగా చదువవలెను. ఫరజ్ నమాజులలో జొహరు, అసరుయొక్క నాలుగు రకాతులలోకూడ సూరాలు నిశ్శబ్దముగా చదువవలెను. ఫజరు, మగ్రిబ్, ఇషా నమాజుల మొదటి రెండు రకాతులలో సూరాలు శబ్దముతో ప్రక్కవారు విను నట్లు చదువవలెను. మిగిలిన మూఁడవ నాలుగవ రకాతులలో సూరెఫాతిహా నిశ్శబ్దముగా చదువవలెను.

—:వితరు నమాజు:—

ఇషా నమాజు పిదప "వాజిబెవితరు" అనుమూఁడు రకాతులు నమాజు చేయునవలెను. యథాప్రకారము రెండు

రకాతులు నమాజుచేసి, మూఁడవ రకాతు నమాజు చేయుటకు నిలిచి సూరెఫాతిహాతో మఱొక సూరాను చేర్చి చదివి అల్లాహు అక్బరు అని పలుకుచు చేతులు చెవుల వఱకు నెత్తి తిరిగి చేతులు కట్టుకొని దుఆయెఖునూత్ చదివి యథాప్రకారముగా రుకూమఱియు రెండుసజ్దాలుచేసి, అత్తహియ్యాతుదరూదె ఇబ్రాహీమ్ దుఆయెమసూరా చదివి సలామ్ చేసి నమాజు ముగింపవలెను. ఆ మూఁడు రకాతులలో సూరాలను నిశ్శబ్దముగా దదువవలెను. కాని రమజాను నెలలో మాత్రము నమాజు చేయించు ఇమామ్ (గురువు) చదువు నపుడు సూరాలను శబ్దముతో చదువవలెను. దుఆయెఖునూతు శబ్దముతో చదువకూడదు.

—: నమాజె ముసాఫిర్ :—

ఎవరు తమపురమునుండి 48 మైళ్ల దూరమునకు ప్రయాణమగుదురో వారు ముసాఫిర్ అనఁబడుదురు. వారు ఇతర పురములో పదియేను దినముల వఱకు లేక దానికన్న ఎక్కువ దినము లుండఁదలఁచినచో వారు ముఖీము అనఁబడుదురు. పదియేను దినములకన్న తక్కువ దినము లుండఁదలఁచిన వారు తిరిగి తమ పురమునకు వచ్చి చేరునంత వఱకు నాలుగు రకాతులు గల ఫరజ్ నమాజులు రెండురకాతులుగ నమాజు చేయవలెను. అవి జొహరు అసరు ఇషానమాజులు. ఒక వేళ ప్రయాణములో నున్నప్పుడు అచ్చటివారి (ముఖీము) వెనుక నమాజు చేసిన యథా ప్రకారము నాలుగు రకాతులు నమాజు చేయవలెను. ముసాఫిరు నమాజు చేయించినచో వెనుకనున్న ముఖీమువారు మిగిలిన రెండు రకాతులు సూరాలు చదువకుండ

స్వాయముగా చేసికొనవలెను. ముసాఫిరు రెండు రకాతులు నమాజుచేసి ముగింపవలెను.

—: నమాజె బీమార్ :—

దేవుఁడు తనభక్తులపై చాల దయగలవాఁడు. అతఁడు తనభక్తుల కష్టసమయములలో అనేక సౌకర్యములు గలిగించెను. అందుచే రోగపీడితులై నిలిచి నమాజు చేయలేని వారు కూర్చుండి నమాజు చేసికొనవచ్చును. మఱి కూర్చుండుటకు శక్తిలేనపుడు వెల్లకిల పరుండి నమాజుచేసికొన వచ్చును. పరుండునపుడు ముఖము ఖిబ్లావెపునకు నుండుటకై కాళ్ళు ఖిబ్లావెపున చాఁచవలెను. పరుండి నమాజు చేయునపుడు తలతో సైగచేసి నమాజు చేయవలెను. తలతో సైగచేయుటకు శక్తి లేనపుడు కన్నులతో సైగచేసి నమాజు చేయకూడదు. అట్టి సితిలో నమాజు నిలిపి వేయవలెను. శక్తిగలిగినపుడు తిరిగి ఆ నమాజులు పూర్తిచేసికొనవలెను. సొమ్మసిల్లి అయిదు పూఁటలు లేక వానికన్న తక్కువ పూఁటల నమాజులుతప్పి పోయినచో తిరిగి తెలివి వచ్చిన పిదప ఆ నమాజులను చేసి తీరవలెను. సొమ్మసిల్లిన పిదప అయిదు పూఁటల నమాజుకన్న ఎక్కువ పూఁటల నమాజు తప్పిపోయినచో వానిని తిరిగి చేయనక్కఱలేదు.

—: సజ్దయే సహూ :—

నమాజులో హెచ్చుతగ్గులైనచో దాని నవరించుకొనుటకు అత్తహియ్యాతు చదివిన పిదప కుడి ప్రక్కకు సలామ్‌చేసి రెండు సజ్దాలు చేసి తిరిగి అత్తహియ్యాతు మొదలైనవి పఠించి నమాజు పూర్తిచేసికొనవలెను. అట్టి సజ్దాలనే సజ్దయే సహూ

అనుదురు. హెచ్చుతగ్గులు పొగపాటుతో కావలెను. అపుడు పై విధముగా సజ్దాలుచేసిన నమాజు పూర్తియగును కాని కావలెనని హెచ్చుతగ్గులు చేసినచో నమాజు భంగమగును. తిరిగి నమాజు చేయువలెను. మఱచి ఏదైన వాజిబు వదలినగాని వాజిబును ఆలస్యముగ చేసినగాని ఫరజును ఆలస్యముతోఁ జేసినగాని ఫరజును ముందుగానే చేసినగాని ఒక ఫరజును రెండుసార్లుచేసినగాని సహూ సజ్దాచేయవలెను. దాని ఉదాహరణములు:-మఱచి ఒక రకాతులో రెండురుకూలుచేసిన లేక మూఁడు సజ్దాలుచేసిన లేక అత్తహియ్యాతు వదలిన నాలుగు లేక మూఁడు రకాతులు గల నమాజులో మొదటి ఖాదా (రెండు రకాతుల పిదప కూర్చుండుట)లో అత్తహియ్యాతుచదివి దరూదులో అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్ వఱకు చదివిన లేక అంతసేపు ఊరక కూర్చుండిన ఇమాము నమాజులో సూరాలు శబ్దముతోచదువవలసినపుడు నిశ్శబ్దముగాను, నిశ్శబ్దముగా చదువవలసినపుడు శబ్దముతోను చదివిన సహూసజ్దా చేయవలెను. ఫరజ్ నమాజులలోని మొదటిరకాతులో లేక రెండవరకాతులో మఱియు వాజిబ్ సున్నత్ నఫిల్ యొక్క ఏరకాతులోనైనను సూరెఫాతిహా చదువకవదలిన లేక ఒకరకాతులోనే సూరయేఫాతిహా రెండుసార్లు పఠించిన లేక సూరెఫాతిహాకు ముందుగానే ఇతరసూరా పఠించిన లేక ఫరజ్ నమాజులోని మూఁడవ నాలుగవ రకాతులలో తప్ప మిగిలిన ప్రతి నమాజు రకాతులోని సూరావదలిన సహూసజ్దా చేయువలెను. మొదటిఖాదాలో మఱచి కూర్చుండక లేచినపుడు జ్ఞప్తికివచ్చి పూర్తిగా నిలువని స్థితిలో నున్నపుడు కూర్చుండి అత్తహియ్యాతు చదువవలెను. సహూసజ్దా చేయనక్కఱ లేదు.

పూర్తిగా నిలుచునట్టి స్థితిలో నున్నపుడు ఖాదావదలి సహూ సజ్దా చేసికొనవలెను. తిరిగి కూర్చుండఁగూడదు. ఇమాము సహూ సజ్దా చేసినచో వెనుకనున్న ముఖ్తదీలుకూడ సహూసజ్దా చేయవలెను. ముఖ్తదీ హెచ్చుతగ్గులుచేసిన సహూసజ్దాచేయకూడదు. మస్‌బూఖ్ తన మిగిలిన నమాజు పూర్తిచేసి కొనునపుడు మఱచి హెచ్చు తగ్గులు చేసిన సహూసజ్దాచేయవలెను.

నమాజులో తక్బీరేతహ్రీమా (నమాజు ప్రారంభించునపుడు అల్లాహు అక్బరు అని చెప్పుట) ఖియామము (నిలుచుట) ఖిరాఅత్ (ఖురాను వాక్యములు పఠించుట. అది చిన్నమూఁడు ఆయతులు లేక అయతుల్ కుర్సీవంటి పెద్ద ఆయతుకన్న తక్కువగ నుండకూడదు) రుకూ, సజ్దా, ఆఖరు ఖాదా, అను వానిలో నేదైన మఱచి లేక కావలెనని వదలినచో నమాజు భంగము (బాతిల్) అగును. తిరిగి నమాజు చేసికొనవలెను.

—: ముఫ్సిదాతె నమాజ్ :—

కొన్ని విషయముల వలన నమాజు తిరిగి చేయవలసి వచ్చును. వానిని ముఫ్సిదాతె నమాజ్ అనుదురు. అది నమాజులో మాటలాడుట, తినుట, త్రాగుట, ఇతరులకు సలామ్ చేయుట, సలామునకు జవాబిచ్చుట, దుఃఖముతో ఏడ్చుట. పక పకమనినవ్వుట, ఏదైన నమాజునకు సంబంధముకాని కార్యము చేయుట, ఖిబ్లావైపునుండి రొమ్మును త్రిప్పుట, ఇమామునకు ముందుగా నిలుచుట, సూరాలు చదువుటలో తప్పులు చేయుట మొదలైనవి.

—: మక్రూహాతె నమాజ్ :—

నమాజులో చేయఁదగనివి కొన్ని విషయములు గలవు. వానివలన నమాజులో లోపము గలుగును. వానినే మక్రూ

హాతె నమాజ్ అనుదురు. అవి నమాజులో అటునిటు చూచుట, వస్త్రము వ్రేలాడవిడుచుట, వస్త్రములను మట్టితగులునని వానిని ఎత్తిపట్టుట, శరీరముతోఁగాని వస్త్రములతోఁగాని ఆడుట, నోటిలో నేదైన వస్తువు నుంచుకొనుట, లక్ష్యములేక సోమరితనముచే తలపై గుడ్డలేకుండ నమాజుచేయుట, తల వెండ్రుకల కొప్పుకట్టుకొనుట, ఒంటికి రెంటికి తొందర ఉన్న సితిలో నమాజుచేయుట, వ్రేళ్లు విఱుచుట, సజ్దాస్థలమునుండి గులకరాళ్లు నమాజులోనుండియు తొలఁగించుట, (కానిసజ్దా చేయుటకు వీలులేనప్పుడు ఒక తూరి చేయవచ్చును) కుక్కవలె కూర్చుండుట, పురుషులు సజ్దాలో మోఁచేతులు నేలపై ఆనించుట, ఇతరుల ముఖమునకు నెదురుగా నిలిచి నమాజుచేయుట, తల చేతి సైగలతో సలామునకు జవాబిచ్చుట, కారణము లేకయే బాసికపట్టు (ఆల్తీపాల్తీ) చేసి కూర్చుండుట, కావలెనని ఆవులించుట, శక్తిగలిగియు దానికి ఆఁపకపోవుట, కన్నులను మూసికొనుట, (కాని మనస్సును నమాజులో నిలుపుటకై కన్నులను మూసికొనిన మక్రూహు కాదు) ఇమాము గూటి (మెహ్రాబె) లో నిలుచుట, (కాని పాదములు గూటికి బయట నున్నచో నిలువవచ్చును.) మొదటి పంక్తి (సఫ్) లో జాగా యుండియు వెనుకటి పంక్తిలో నిలుచుట, జీవుల చిత్రములుగల వస్త్రములు ధరించి నమాజుచేయుట, నలుప్రక్కలు జీవుల పటములున్న చోటున నిలిచి నమాజుచేయుట, నమాజులో దేహము విఱుచుట, తలపాగా పట్టిపై సజ్దాచేయుట, పురుషులు పట్టువస్త్రములు ధరించి నమాజుచేయుట, పురుషులు బంగారు నగలును ఉంగరమును ధరించి నమాజు చేయుట అనునవి.

—: సజ్దయే తిలావత్ :—

ఖురానెషరీఫులో పదునాలుగు చోటులలో నచటి వాక్యములు పఠించిన లేక యితరులు పఠించుచుండఁగా వినిన ఒకసజ్దా చేయవలెను. దాని షరతులు నమాజులోని సజ్దాల వంటివియె. నిలిచి అల్లాహుఅక్బరు అనుచు ఒకసజ్దాచేసి తిరిగి అల్లాహుఅక్బరు అని చెప్పుచు నిలువవలెను. కూర్చుండిచేసినను చేయవచ్చును. సజ్దాగల ఖురానెషరీఫువాక్యములు నమాజులో పఠించినచో దానికొఱకు ఒక సజ్దా నమాజులోనే చేయవలెను.

—: ముద్రిక్, మస్బూఖ్ లాహిఖ్ :—

జమాఅతుతో నమాజుసలుపువారు ముద్రిక్, మస్బూఖ్, లాహిఖ్ అనఁబడుదురు. ముద్రిక్ అనఁగా ప్రారంభము నుండి అంత్యము వఱకు జమాఅతుతో కలిసి నమాజుచేసియు వాఁడు. మస్బూఖ్ అనఁగా జమాఅతుతో ప్రారంభమునుండియే ఒకటిగాని దానికన్న నెక్కువగాని రకాతులనమాజుతప్పిపోఁగా వచ్చి జమాఅతుతోకలిసి నమాజుచేయువాఁడు. ఇట్టి వాఁడు తప్పిపోయిన రకాతులను ఇమామ్, సలాముచేసి నమాజు ముగించిన పిదప సలామ్చేయకుండ లేచి స్వయముగా నమాజు చేసికొనవలెను. తప్పిపోయిన నమాజు చేయునపుడు యథాప్రకారముగా నిశ్శబ్దముగా సనా మఱియు సూరాలు చదువవలేను. లాహిఖ్ అనఁగా జమాఅతుతో కలిసిన పిదప ఒకటిగాని దానికన్న నెక్కువ రకాతులుగాని తప్పిపోయిన వాఁడు. అట్టివాఁడు తనతప్పిపోయిన నమాజు వేఱుగా పూర్తి చేసికొని ఇమాముతో కలిసి నమాజుచేయవలెను. లాహిఖ్ వేఱుగా నమాజుచేయునపుడు సూరాలు చదువకూడదు. ఒక

వేళ లాహిఖ్ తనతప్పి పోయిన రకాతులు పూర్తి చేసికొనక పూర్వమే నమాజుముగిసినచో తననమాజు పూర్తి చేసికొన వలెను. అపుడు కూడ సూరాలు పఠింపకూడదు.

—: న మా జె ఖ జా :—

నమాజు దానివేళలో చేసిన దానిని అదా అనుదురు. నమాజువేళ తప్పిపోయిన పిదప ఇతర వేళలో నమాజు చేయు దానిని నమాజెఖజా అనుదురు. కారణము లేనిది, నమాజు వేళ తప్పించుట చాల పాపము. ఫరజ్ నమాజులు వాజిబ్ నమాజులు వేళతప్పినచో వానినితిరిగి చేయవలెను. ఫజరు నమాజులోని ఫరజ్ సున్నత్ నమాజులు తప్పిపోయినచో సూర్యోదయ మైన పిదప ప్రొద్దువాలు లోపల తిరిగి సున్నత్ ఫరజ్ నమాజులు చేయవలెను. ప్రొద్దువాలిన పిదప ఫరజ్ నమాజు మాత్రము చేయవలెను. ఖజానమాజు చేయునపుడు ఫలానిదినము నందలి ఫలాని పూంట నమాజు ఖజాపూర్తి చేయుచున్నానని యుద్దేశింపవలెను. దానినే నియ్యతెఖజా అనుదురు. జొహరు, జుమా నమాజులందు ఫరజులకు ముందున్న సున్నతులు తప్పి పోయినచో వానిని ఫరజ్ నమాజు పిదపనుండు సున్నతుల తరువాత చేసికొనవలెను.

—: న మా జె జు మా :—

శుక్రవారమునాఁడు చేయు నమాజును నమాజెజుమా అనుదురు. సూర్యుఁడు వాలి నప్పటినుండి దానివేళ ఆరంభమై అసరువేళ వచ్చువఱకు నుండును. ఈ నమాజుచేసినవారు జొహరు నమాజు చేయరాదు. ఈ నమాజు కొఱకు స్నానము చేసి పరిశుభ్రమైన దుస్తులు ధరించి అత్తరు సుర్మా వేసికొని

మసీదునకు పోవుట సున్నత్ ఉన్నది. వేళకు సరిగా మొదటి తూరి అజాను ఇయ్యవలెను. మొదటి నాలుగు రకాతులు సున్నత్ నమాజు ముందువ్రాసిన పద్ధతిగా ఒంటరిగా చేయవలెను. సున్నత్ నమాజు ముగిసిన పిదప ఖతీబు మింబరుపై కూర్చుండవలెను. అపుడు ఖతీబునకు ఎదురుగా నిలిచి రెండవతూరి అజాను ఇయ్యవలెను. అజాను ముగిసిన పిదప ఖతీబు రెండు ఖుత్బాలు చదువవలెను. మొదటి ఖుత్బా (మతబోధ) ముగిసిన పిదప ఖతీబు కొంతసేపు కూర్చుండి తిరిగి లేచి నిలిచి రెండవ ఖుత్బా చదువవలెను. ముసల్మాను లందఱు ఖుత్బా భయ భక్తులతో వినవలెను. ఖుత్బాజరుగు సమయములో అందఱు నిశ్శబ్దముగా నుండవలెను. ఏలాటి చప్పుడు చేయరాదు. రెండు ఖుత్బాలు ముగిసినపిదప ఖుత్బా చదివినవాఁడు రెండు రకాతులు నమాజు చేయించవలెను. ముందుగా నిలిచి నమాజు చేయించువానిని ఇమామ్ అనుదురు. ఇమామ్ నమాజు ధర్మములును ఖురాను పఠనము (ఖిరాఅతు) ను బాగుగ నెఱింగియుండవలెను. అందఱు జమా అతుగా నమాజు సలుపవలెను. నమాజు చేయించు ఇమామ్ నమాజులో సూరెఫాతిహా మఱియు నొక సూరాచేర్చి శబ్దముతో చదువ వలెను. అట్లు రెండు రకాతులు ఫరజ్ నమాజు చేయవలెను. ఇమామునకు వెనుకనున్న వారు (ముఖ్తదీలు) నమాజులో పఠింపఁబడు ఖురానెషరీఫును వినయభక్తులతో వినుచుండవలెను. ముఖ్తదీలు ఇమాము వెనుకసూరాలు పఠింపఁగూడదు. నమాజులోని యాచారములు ఇమామును అనుసరించి ముఖ్తదీలు చేయవలెను. ఇమామునకు ముందుగా ఏ యాచారము చేయ కూడదు.

ఇమామ్, తక్బీరు చెప్పిన పిదప ముఖ్తదీలు నిశ్శబ్దముగా చెప్పవలెను. ఇమామ్ సూరెఫాతిహా చదివి వలజ్ జాల్లీన్ అనిన పిదప ముఖ్తదీలు నిశ్శబ్దముగా ఆమీన్ అని చెప్పవలెను. ఇమామ్ రుకూలోపోయిన తరువాత ముఖ్తదీలు రుకూలో పోవలెను. ఇమామ్ రుకూనుండి లేచుచు సమిఅల్లాహు.లిమన్ హామిదహు అని చెప్పిన పిదప ముఖ్తదీలు నిశ్శబ్దముగా రబ్బ నా-లకల్ హమ్దు అని చెప్పవలెను. ఇమామ్ సజ్దాలో పోయిన పిదప ముఖ్తదీలు పోవలెను. రుకూ సజ్దాల నుండి ఇమామునకు ముందుగానే ముఖ్తదీలు తలలు ఎత్తకూడదు. (ఇటులేజమా అతుతో జరుగు ప్రతినమాజులోను ముఖ్తదీలువర్తింపవలెను.) ఇమామ్ రెండు రకాతులు నమాజుచేసిన పిదప అందఱును ఒంటరిగా నాలుగు రకాతులు సున్నత్ నమాజుచేసి తిరిగి రెండు రకాతులు సున్నత్ నమాజు చేయవలెను. దాని పిదప రెండేసి రకాతులుగా నఫిల్ నమాజు చేయవచ్చును. నమాజె జుమా జమాఅతుతో చేయవలసినది. అట్లు చేయఁబడు నమాజు సామాజిక ప్రార్థన అనఁబడును అయిదు పూఁటలలోని ఫరజ్ నమాజులు జమాఅతుగా చేయవలెను. ఒక వేళ ఎవరికైన జమా అతుతో నమాజు దొరకనిచో ఒంటరిగా నమాజు చేయవలెను. నమాజెజుమాయొక్క జమాఅతు తప్పిపోయినచో నమాజెజుమా ఒంటరిగా చేయగూడదు జొహరు నమాజు చేసికొనవలెను.

## —: నమాజెకుసూఫ్ :—

సూర్యగ్రహణము చంద్రగ్రహణము గలుగునపుడు దేవునియందు భయభక్తులు చూపుచు రెండు రకాతులు నమాజు చేయవలెను. సూర్యగ్రహణము గలుగునపుడు జమాఅతుతో

రెండురకాతులు నమాజు చేయవలెను. గ్రహణము వదలువఱకు నమాజు, మఱియు దుఆ చేయుచుండవలెను. చంద్రగ్రహణమునందు ఒంటరిగా రెండురకాతులు నమాజుచేయవలెను. అందు జమాఅతు లేదు. ఈ నమాజులనే నమాజెకుసూఫ్ అనుదురు.

—: నమాజెఇస్తిస్ఖా :—

వర్షము లేక కష్టము గలిగి నపుడు వర్షము కురియుటకై దేవుని ప్రార్థింపవలెను. దానిని నమాజె ఇస్తిస్ఖా అనుదురు. ఈదుగా మసీదునకుఁబోయి రెండురకాతులు నమాజు చేయవలెను. నమాజుజమాఅతుతో కలిసి చేయవలెను. అందుసూరాలు శబ్దముతో చదువవలెను. నమాజుపిదప ఇమామ్ ఖుత్బా చదువవలెను. దాని పిదప దేవుని సమ్ముఖమున భయభక్తులతో దుఆ చేయవలెను. దుఆ:- అల్లాహుమ్మ_అస్ఖినా గైసన్_ముగీసన్_హానీఅన్_మరీఅన్_మురీఅన్_నాఫిఅన్ గైర_జాఇరిన్.

అట్లు మూఁడు దినములవఱకుపోయి నమాజుచేయవలెను. నమాజునకు పోవుటకు పూర్వము నిఱుపేదలకు దాన మొసంగవలెను. తమతమ పాపముల క్షమాపణ కోరుకొనవలెను. బాలురును ముసలివారును కూడ పోవలెను. పశువులను కూడ వెంట తీసికొనిపోవుట మంచిది.

—: నమాజెతరావీహ్ :—

రమజాను నెలలో ఇషానమాజు పిదప ఇరువది రకాతులు నమాజు రెండు రెండు రకాతులుగ చేయవలెను. నాలుగు రకాతుల పిదప కొంతసేపు విరామము తీసికొనవలెను. ఆవిరామ కాలములో దైవనామ స్మరణము (తస్బీహ్) లేక ఖురానెషరీఫు లేక నఫిల్ నమాజు నిశ్శబ్దముగా చేయవచ్చును. లేక యూరక

కూర్చుండవచ్చును. ఈ నమాజునే తరావీహ్ అనుదురు. ఈ నమాజునందు నెలలోపల కనీసము పూర్తిగ ఒకతూరి ఖురాను షరీఫు పఠించి ముగించుట చాల ఉత్తమము (సున్నత్తు). అట్లు పఠించు (హాఫిజు) వారు దొరకనిచో ముందువ్రాసియున్న చిన్న చిన్న సూరాలు చదువుకొనవచ్చును. ఈ నమాజులలోకూడ ఇమామ్ సూరాలను శబ్దముతో చదువవలెను.

—: ఏతికాఫ్ :—

పైగంబరులవారు రమజానునెల ఆఖరు పదిదినములలో మసీదులోనే దైవ ధ్యానమునకై వసించుచుండిరి. దానినే ఏతికాఫ్ అనుదురు. పైగంబరులవారు పరలోకముచేరిన సంవత్సరము రమజానునెలలో పూర్తిగ 20 దినములు మసీదులోనే వసించి ఏతికాఫు సలిపిరి. పైగంబరులవారు ఆ దినములలో జిబ్రీలు దూతకు ఖురానెషరీఫు వినిపించుచుండిరి. అట్లు ఏతికాఫుచేయుట ముసల్మానుల కొఱకు సున్నతుగానున్నది. (సున్నతు అనగా పైగంబరులవారు ఉపదేశించిన ఆచరించిన ధర్మము.) ఏతికాఫు కొఱకు మసీదులలో నివసించునపుడు మలమూత్ర విసర్జనము మొదలైన వాని కొఱకు మసీదునుండి బయటికి పోవచ్చును. మిగిలిన సమయములలో దైవధ్యానములో నుండవలెను.

రమజాను బకరీదు పండుగల నమాజు (నమాజె ఈదైన్):—

హ్జరత్ పైగంబరులవారు రమజానునెల ముగిసినపిదప షవ్వాలునెల మొదటితేదిన రెండు రకాతులు నమాజు సలుపుచుండిరి. మఱియు జుల్‌హాజ్ నెల పదియవ తేదిని రెండు రకాతులు నమాజు సలుపుచుండిరి. ఆనమాజులను నమాజెయీదైను (రమజాను బకరీదు పండుగల నమాజు) అనుదురు. అవి కొం

చేము ప్రొద్దెక్కిన పిదప ప్రొద్దువాలు వఱకు సలుపఁబడును. దానికొఱకు స్నానము. వజూచేసి మంచి వస్త్రములు ధరించి సుర్మా ,అత్తరు పూసికొని ఈదుగా మసీదునకు వెడలవలెను. అచట నందఱు ముసల్మానులు కూడిన పిదప నమాజు కొఱకు పంక్తు (సఫ్) లుగా నిలిచిన పిదప ఇమామ్ నమాజు చేయించవలెను. నమాజుకొఱకు సంకల్పించి (నియ్యత్ చేసి) అల్లాహు అక్బరు అనుచు చేతులుకట్టుకొనవలెను. పిదప సనా చదువవలెను. మరల అల్లాహు అక్బరుఅనుచు చేతులు చెవుల వఱకు నెత్తి విడిచి పెట్టవలెను. మరల అల్లాహు అక్బరుఅనుచు చేతులు చెవుల వఱకు నెత్తి విడువవలెను. పిదప అల్లాహు అక్బరు అని చెప్పుచు చేతులెత్తి యథాప్రకారముగా కట్టుకొనవలెను. దాని పిదప అఊజుబిల్లాహి, బిస్మిల్లాహి, సూరెఫాతిహాతో మఱొక సూరా చేర్చి చదివి యథాప్రకారముగా ఒక రుకూ రెండుసజ్దాలు చేసి లేచి నిలువవలెను. దాని పిదప బిస్మిల్లాహి సూరెఫాతిహాతో మఱొక సూరాను చేర్చి పఠించి అల్లాహు అక్బరు అనుచు చేతులు చెవులవఱకు నెత్తి విడిచి పెట్టవలెను. మరల అల్లాహు అక్బరుఅని పలుకుచు చేతులు చెవులవఱకు నెత్తివిడిచిపెట్టవలెను. మరల అల్లాహు అక్బరు అని చెప్పుచు చేతులు చెవులవఱకు నెత్తి విడిచి పెట్టవలెను. దాని పిదప అల్లాహు అక్బరు అనుచు రుకూ యథాప్రకారము చేయవలెను. దాని పిదప యథాప్రకారము రుకూనుండి లేచి రెండు సజ్దాలుచేసి అత్తహియ్యాతు దరూదె ఇబ్రాహీము దుఆయె మాసూరా చదివి సలామ్చేసి నమాజు ముగింపవలెను. ఇమాము వెనుకనున్న ముక్తదీలు ఇమామువలె అన్ని యాచారములు చేయవలెను. కాని ఇమామ్ నమాజులో

ఖురానె షరీఫు సూరాలను పఠించునపుడు నిశ్శబ్దముగా విన వలెను. ఈనమాజులుకూడ జమాఅతుతో చేయవలసినది. జమా అతు తప్పిపోయిన ఒంటరిగా నమాజు చేయకూడదు. దాని పిదప ఇమామ్ రెండు ఖుత్బాలు చదివి యితరులకు బోధింపవలెను. దాని పిదప నందఱు తమతమ ఇండ్లకు పోవచ్చును. రమజాను పండుగ దినమున సదఖయే ఫితర్ అను దానము చేయవలెను. దానింగూర్చి ముందు జకాతువిషయములో వ్రాయుదుము.

బకరీదుపండుగ, బకరీదు (జిల్‌హజ్) నెల పదియవ తేదిని అగును. బకరీదు నెల తొమ్మిదవ తేది ఫజరు నమాజు మొదలు బకరీదునెల పదుమూండవ తేది అసరునమాజువఱకు ప్రతిఫరజు నమాజు పిదప ఒకతూరి "అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ లాఇలాహ-ఇల్-లల్లాహు- వల్లహు అక్బర్ అల్లాహు అక్బర్ -వ లిల్లాహిల్-హమ్దు" అని శబ్దముతో పఠింపవలెను. దీనినే తక్బీరె-తష్రీఖ్ అనుదురు.

—: ఖుర్బానీ :—

బకరీదు పండుగ దినమునందును దాని పిదప రెండుదినము లందును ఖుర్బానీ చేయవచ్చును. ఈ దినములలో ధనవంతులు దేవునిప్రీతికొఱకు భక్తి వినయములతో ఖుర్బానీ చేయవలెను. ధనము గలిగియు ఖుర్బానీ చేయనివారు పాపము చేసినవారగు దురు. స్త్రీలు, పురుషులు, శక్తిగలవారు ప్రతివారును ఖుర్బానీ చేయవలెను. ఖుర్బానీకొఱకు మేక గొఱ్ఱె ఒక్కొక్కటి ఒకరి తరఫున చాలును. ఒక్కొక్క ఒంటెను ఆవును గేదెను ఏడేసి మంది కలిసి ఖుర్బానీ చేయవచ్చును. వారు సమభాగములుగా వాని మాంసము పంచుకొనవలెను. ఖుర్బానీమాంసము మూండు

భాగములుగఁ జేసి యింటివారి కొఱకు ఒకభాగము బంధువుల కొఱకు నొకభాగము బీదలకొఱకు నొకభాగము పంచవలెను. దాని చర్మము సొంతపనికి నుపయోగింపవచ్చును. దాని అమ్మి నచో ఆ సైకమును ఖర్చుచేసికొనక బీదలకు దానము చేయ వలెను. ఖుర్బానీ జంతువు బక్క చిక్కినది గాని గ్రుడ్డిదిగాని చెవులు తోఁక తెగినదిగాని యుండఁగూడదు. బీజములు కొట్టఁ బడిన దానిని ఖుర్బానీ చేయవచ్చును.

ఖుర్బానీచేయువారు స్వయముగా తమ చేతులార జబా చేయుట శ్రేష్ఠమైనది. లేక ఇతరులుకూడ జబాచేయవచ్చును. ఖుర్బానీ కొఱకు మేఁక గొఱ్ఱె ఒక సంవత్సరముగలది యుండ వలెను. ఆవు రెండు సంవత్సరములు గలది యుండవలెను. ఒంటె అయిదు ఏండ్లుగలది యుండవలెను. ఖుర్బానీ చేయుటకు ముందు ఇన్నీ-వజహ్తు-వజ్హియ-లిల్ల జీ-ఫతరస్ - సమావాతి - వల్ అర్జ- హనీఫన్-వమాఅనా - మినల్-ముష్రికీన్, ఇన్న - స లాతీ- వనుసుకీ- వమహ్యాయ-వమమాతీ - లిల్లాహి- రబ్బిల్- ఆల మీన్ - వలాషరీక_లహు_వబిజాలిక_ఉమిర్తు_వఅనా - అవ్వలు ల్_ముస్లిమీన్, అని చదివి చెప్పఁబోవు పద్ధతి ప్రకారము జబాచేయవలెను.

—; జబాచేయు పద్ధతి :—

జబాచేయుటకై కత్తి పదును గలదిగా నుండవలెను. ఏ జంతువునైనను జబాచేయునపుడు "బిస్మిల్లాహి అల్లాహుఅక్బ ర్" అని చెప్పవలెను. జబాచేయుటలో నాలుగునరములు తెగ వలెను. అవి కుత్తుక, (ఊపిరినాళము, ఆహారనాళము) రెండు రక్తనాళములు అనునవి. జబాచేయునపుడు బిస్మిల్లాహి అల్లాహు

అక్బర్ అని చెప్పనిచో జంతువు ముర్దారుఅగును. దానిమాంసము భక్షింపకూడదు. బాణములతో వేటాడునపుడు బిస్మిల్లాహిఅల్లాహుఅక్బర్ అని చెప్పి బాణము విడిచినచో దాని గాయముతగిలి జంతువు ప్రాణము విడిచినచో దాని మాంసము తినవచ్చును. టుపాకితో బిస్మిల్లాహి అని కాల్చినచో తిరిగి జంతువును ప్రాణములో నున్నపుడు యథా ప్రకారము జబా చేయవలెను. అట్లు కాక టుపాకి దెబ్బతోనే జంతువు ప్రాణమువిడిచిన అది ముర్దారు అగును. దానిని తినఁగూడదు.

జంతువులలో క్రూర జంతువులను పక్షులలో క్రూరపక్షులను తినరాదు. క్రూరజంతువులు సింహము, పులి, ఏనుగు, చిఱుత, గండు, తోఁడేలు, నక్క, కుక్క, పిల్లి, కోతి, ఎలుఁగుగొడ్డు మొదలైనవి గాడిద, కంచరగాడిద మాంసములు తినకూడదు. పురుగులు, విషపురుగులు, ఎలుకలు, పందికొక్కులు, తొండ, ఈఁగలు, దోమలు ఇసుళ్లు, పాములు, కప్పలు, తేళ్లు మొదలైనవి తినకూడదు. పందిమాంసము తినకూడదు. మాంసము భక్షింపఁదగిన జంతువులను జబాచేయునపుడు ప్రవహించు రక్తమును తినకూడదు. అట్టి రక్తముకూడ పందిమాంసముతో సమానము. చచ్చిన జంతువుల మాంసము తినకూడదు. క్రూరపక్షులు, డేగ, గద్ద కాకిమొదలైనవి అవి వేటాఁడు పక్షులు. వాని మాంసము భక్షింపఁగూడదు.

## —:భక్షింపఁగల మాంసము:—

ఒంటె, ఆవు, గేదె, మేఁక, గొఱ్ఱె, కుందేలు, జింక, మొదలైన గిట్టలు చీలియున్న సాధుజంతువుల మాంసము ధర్మ ప్రకారముగా జబాచేసి భక్షింపవచ్చును. పక్షులలో సాధు

పక్షులు అనఁగా వేటాఁడనివి. పావురము, పిట్ట, బాతు, కొంగ, నెమిలి, కోడి మొదలైనవాని మాంసము భక్షింపవచ్చును. నీళ్ల లో వసించువానిలో చేపజాతిని మాత్రము తినవచ్చును. నీళ్ల నుండు మిగిలిన జంతువులు తాఁబేలు, ఎండ్రకాయలు, మొసళ్లు మొదలైనవానిని భక్షింపరాదు. స్వయముగా నీళ్ళలో చచ్చిన చేపలను తినరాదు. రొయ్యలు చేపజాతిలో చేరినవికావు అని కొందఱు మతవిద్వాంసులు చెప్పుదురు. కావున వానిని తిన కుండుట మంచిది.

—:అవసానకాలము (సక్రాత్):—

ఎవ్వనికైనను మరణకాలము సమీపించినచో నతనిని వెల్లకిల పరుండఁబెట్టి వానికాళ్లు ఖిబ్లావైపునకుచాఁచి ముఖము ఖిబ్లా దిక్కునకు నుండునట్లు చేయవలెను. అపుడు కలిమ యేషహాదత్ అతనికి వినిపించునట్లు అతనియొద్ద పఠింపవలెను. దానినే తల్ఖీను అనుదురు. అప్పుడు ఇహలోక సంబంధమైన విష యములు ముచ్చటింపఁగూడదు. పరలోకసంబంధమైన భక్తి విషయములు ముచ్చటింపవచ్చును. ప్రాణము పోయిన పిదప అంగములు సరిగా చేయవలెను. నోరు తెఱవకుండుటకై గడ్డము క్రిందుగా తలపై గుడ్డకట్టవలెను. కన్నులు మూయవలెను-అపుడు బిస్మిల్లాహి-వఅలా-మిల్లతి-రసూ-లిల్లాహి అని పఠింపవలెను.

—: గుసులె మయ్యిత్ :—

మయ్యితు (శవము)నకు స్నానము (గుసులు) చేయింప వలెను. స్నానము చేయించుటకై పరిశుభ్రమైన పలకపై శవమును పరుండఁబెట్టవలెను. శవము ధరించియున్న దుస్తులను తీసివేసి పరిశుభ్రమైన గుడ్డతో అంగములను కప్పవలెను. స్నానమునకై

రేగాకు వేసి నీళ్లు కాచవలెను. అదిలేనిచో స్వచ్ఛమైన నీళ్లు కూడచాలును. శవమును పరుండబెట్టిన పలకకు సాంబ్రాణిపొగ ఇయ్యవలెను. శవమును వజూచేయింపవలెను. కాని పుక్కిలించుటగాని ముక్కులో నీళ్లువేయుటగాని చేయరాదు. పిదప శవముపై నీళ్లు వేయవలెను. తలను గడ్డమును బాగుగా కుంకుడు కాయలనీళ్లతో రుద్ది కడుగవలెను. దాని పిదప శవమును ఎడమ ప్రక్కపై పరుండబెట్టి నీళ్లు పోయవలెను. క్రింది భాగమువఱకు నీళ్లుచేరవలెను. తరువాత అటులే కుడిప్రక్కపై పరుండబెట్టి నీళ్లుపోయవలెను. దాని పిదప శవమును కూర్చుండబెట్టి తిన్నగా కడుపును అదుమవలెను. ఏదైన మలినము బయటికివచ్చిన దాని కడుగవలెను. దాని పిదప పరిశుభ్రమైన గుడ్డతో శవమును తుడువవలెను. అబీరు అను సువాసన వస్తువును తలపై గడ్డముపై నుంచవలెను. కర్పూరమును నొసటిపైనను ముక్కుపైనను రెండుచేతులలోను రెండు మోకాళ్ళపైనను రెండు పాదముల పైనను ఉంచవలెను. వెంట్రుకలు గోళ్ళు కత్తిరింపకూడదు. గడ్డము తల దువ్వకూడదు.

—: కఫన్ :—

శవమును స్నానము చేయించిన పిదప పురుషుల శవమును మూడు వస్త్రములలోను స్త్రీల శవమును అయిదు వస్త్రములలోను చుట్టవలెను. దానినే కఫన్ అనుదురు. కఫన్ తెల్లనిదిగా నుండుట శ్రేష్ఠము. పురుషులకుమూడు వస్త్రములు ఖమీసు ఇజారు లిఫాఫా అనునవి. ఖమీసు మెడనుండి పాదముల వఱకుండవలెను. అందు చేతులుగాని కుట్టుగాని కలీగాని ఉండకూడదు. ఇజారు శవమునకు తలనుండి పాదము కడవఱ

కుండవలెను. లిఫాఫాఇజారుకన్న మూరెడు ఎక్కువగానుండ వలెను. వస్త్రములు చుట్టునపుడు ఎడమవైపునుండి ప్రారంభింప వలెను. దానికిగాను మొదట లిఫాఫా పఱచవలెను. దానిపైని ఇజారు పఱచవలెను. దానిపైన ఖమీసునుంచి శవమునకు తొడిగింపవలెను. ఖమీసు తొడిగించిన పిదప ఇజారు ఎడమ ప్రక్కనుండి మడువవలెను. తరువాత కుడిప్రక్క మడువవలెను. దాని పిదప లిఫాఫానుగూడ అటులేమడువవలెను. వస్త్రములు చుట్టిన పిదప పేలికలతో కట్టవలెను. స్త్రీలకుపైన వ్రాసిన మూడు వస్త్రములకు తోడుగ తలకప్పుటకుగాను ఒక వస్త్ర మును రొమ్మును బంధించుటకుగాను ఒక వస్త్రమును ఉండ వలెను. తలగుడ్డ (ఖమార్) రెండుమూరల పొడవును జేనెడు వెడల్పును గలదిగా నుండవలెను. రొమ్ముగుడ్డ (ఖర్ఖా) మూడు మూరల పొడవును వెడల్పు చంకల క్రిందనుండి మోకాళ్ల వఱకు చాలునంతటిదిగా నుండవలెను. స్త్రీలకు కఫను చుట్టు నపుడు ఖమీసునకు పైన తలవెండ్రుకలు రెండుభాగములు గజేసి రొమ్ముపై నుంచవలెను. పిదప దానిపైన తలగుడ్డ (ఖమారు) నుంచవలెను. ఖమారుపైన రొమ్ముగుడ్డ (ఖర్ఖా) ఉంచవలెను. లిఫాఫా రొమ్ము గుడ్డపై నుంచవలెను. కఫను శవమునకు చుట్టకముందే దానికి సాంబ్రాణి పొగపట్టవలెను. మగబిడ్డకు పురుషులవలెను, ఆడుబిడ్డకు స్త్రీలవలెను, కఫను చుట్టవలెను. స్త్రీలశవములకు స్త్రీలును, పురుషుల శవములకు పురుషులును స్నానము చేయించి కఫను చుట్టవలెను.

బిడ్డప్రాణముతో బుట్టి తత్క్షణమే చచ్చినచో పేరుపెట్టి స్నానము చేయించి యథాప్రకారముగ కఫన్ దఫన్ నమాజు

చేయవలెను. బిడ్డ కడుపులోనే చచ్చి పుట్టినచో పేరు పెట్టి స్నానము చేయించి గుడ్డలో చుట్టి పూడ్చి వేయవలెను. నమాజు చేయకూడదు.

పై విధముగా స్నానము చేయించి కఫను చుట్టిన పిదప మంచముపై నుంచవలెను. దాని పిదప నమాజుకొఱకు దాని ఎదుట పంక్తులుగా ఖిబ్లావైపునకు ముఖము చేసి ముసల్మానులు నిలువవలెను. ఈ నమాజు కొఱకు కూడ వజూ చేయవలెను. ఇమామ్ ముఖ్తదీలు నమాజు దేవునికొఱకును దుఆ మయ్యిత్ కొఱకును అని నుద్దేశించి అల్లాహు అక్బరు అని చెప్పుచు చేతులు చెవులవఱకు నెత్తి నాభిక్రిందుగ నుంచుకొనవలెను. దాని పిదప "సుబ్ హానకల్లా-హుమ్మ-వబి హమ్దిక - వతబారక - కస్మక-వత - ఆలా-జద్దుక-వజల్ల, సనావుక-వలా-ఇలాహ- గైరుక్" అని చదివి అల్లాహు అక్బరు అని చెప్పి దరూదె ఇబ్రాహీము చదువవలెను. తరువాత అల్లాహు అక్బరు అని చెప్పి "అల్లాహుమ్మగ్ ఫిర్ - లిహయ్యినా-వ-మయ్యితినా - వషాహిదినా - వగాయిబినా వ_సగీరినా_వ_కబీరినా_వ_జకరినా _వ_వున్సానా_అల్లాహుమ్మ_మన్ అహ్యైతనా _మిన్నా_ఫఅహ్_యిహీ_ అలల్ _ ఇస్లామి_వమన్ తవఫ్_ఫైతహు_మిన్నా_ఫతవఫ్ ఫహూ_అలల్_ఈమాన్" అని చదివి అల్లాహు అక్బరు అని చెప్పవలెను, దాని పిదప కుడి ఎడమ ప్రక్కలకు ముఖము త్రిప్పుచు "అస్సలాము అలైకుమ్_వరహ్మతుల్లాహి" అని పలుకుచు నమాజు ముగింపవలెను. ఇమామ్ అల్లాహు అక్బరు శబ్దముతో పలుకవలెను. అతనికి వెనుకనున్నవారు నిశ్శబ్దముగా పలుకవలెను. మగబిడ్డకుఁగాను "అల్లాహుమ్మజ్ అల్హు _ లనా _ ఫర్తన్_వజ్అల్ హు_లనా_అజ్రన్_వజుఖ్రన్_వజ్అల్ హు

లనా_షాఫిఅన్_వ_ముషఫ్ఫఅన్" అని చదువవలెను.

ఆడుబిడ్డకుగారు "అల్లాహుమ్మజ్_అల్ హా_లనా ఫర్తన్_వజ్అల్హా_లనా_అజ్రన్_వజుఖ్_రన్_వజ్_అల్ హా_లనాషాఫిఅతన్_ముషఫ్ఫఅతన్" అని చదువవలెను. నమాజు ముగిసిన పిదప మంచమును నెత్తుకొని సమాధిచేయుటకై తీసికొనిపోవలెను. ఎత్తుకొనిపోవువారు, కలిమయేషహాదత్ చదివినచో నిశ్శబ్దముగా చదువవలెను. ఏలాటి శబ్దము చేయకూడదు.

—: సమాధి (దఫన్) :—

గోరి నాభివఱకుగాని ఱొమ్మువఱకు గాని, లోతుగా త్రవ్వవలెను. గోరికి ఖిబ్లాదిక్కునకు శవముపట్టునంత గూడు త్రవ్వవలెను. దానినే లహదు అనుదురు. శవమును గోరిలో నుంచునపుడు ఖిబ్లాదిక్కునుండి గోరిలోదింపవలెను. గోరిలో నుంచునపుడు బిస్మిల్లాహి వఅలామిల్లతి రసూలిల్లాహి అని గోరి లో నుంచువారు చెప్పవలెను. గోరిలో శవముయొక్క ముఖము ఖిబ్లావైపునకుండుటకై దానిని కుడిప్రక్కపై పరుండబెట్టవలెను. గూటిలోనుంచిన పిదప పచ్చియిటికలను గూటిపై నుంచవలెను. దాని పిదప గోరిలో మట్టివేయవలెను. శవమును గోరిలోనుంచిన పిదప కఫనుయొక్క బంధనములు విప్పవలెను. గోరిలో మట్టి వేయువారు "మిన్హా ఖలఖ్ నాకుమ్_వ_ఫీహా_ను_ఈదుకుమ్ వమిన్హా నుఖ్రిజుమ్ తారతన్ ఉఖ్రా" అని చదువవలెను. సమాధియైన పిదప మయ్యిత్ కొఱకు దుఆ చేయవలెను. స్త్రీల శవములను సమాధి చేయునపుడు పర్దాపట్టవలెను.

—: ఫాతిహా :—

ఖురానెషరీఫు చదివి దానిపుణ్యము పెద్దలకు అర్పింప

వచ్చును. ధనము, ధాన్యము, వస్త్రములు, అన్నము, దానముచేసి వాని పుణ్యము పెద్దలకు అర్పింపవచ్చును. నఫిల్ సమాజుచేసి నఫిల్ రోజా ఉండి వాని పుణ్యము పెద్దలకు అర్పించిన చేరును. పుణ్యము పెద్దలకు చేరునట్లుగ దేవుని ప్రార్థించినచో పుణ్యము (సవాబు) వారికి చేరును. దానినే ఫాతిహా అనుదురు.

—: గోరీలను దర్శించుట (జియారతెఖుబూర్) :—

పురుషులు గోరీలను దర్శింపవచ్చును. దర్శనమునకై పోయినపుడు "అస్సలాము అలైకుమ్ దారఖౌమిన్ మూమినీన-వయిన్నా-ఇన్షా అల్లాహు బికుమ్ లాహిఖూన్" అని చెప్పవలెను. సూరయే యాసీన్ చదివిన చాల పుణ్యము లభించును. పదునొకండుతూర్లు సూరయే ఇఖ్లాస్ (ఖుల్హువల్లాహు) చదివిన వాని పుణ్యము చనిపోయినవారికి నర్పింపవలెను. దానినే ఫాతిహా అనుదురు. గోరీలను దర్శించునపుడు పరలోకమును ధ్యానింపవలెను. మేము కూడ ఒకదినము మరణింపవలసియున్నదని యూహింపవలెను. గోరీలయొద్దకు ఎట్టి భోజన పదార్థములు తీసికొని పోకూడదు. అచ్చట అగ్గి కాల్చకూడదు. గోరీల చుట్టు ప్రదక్షిణముగాని సాష్టాంగ నమస్కారముగాని చేయఁగూడదు. అట్లుచేయుట పాపకరము.

—: జకాత్ (విధిదానము) :—

జకాతుధర్మము ఇస్లామ్ ముఖ్య ధర్మములలో నొకటి. దానిఁగూర్చి ఖురానెషరీఫులో చాల తాకీదున్నది. ఈ ధర్మమునందు పరోపకార భావము ముఖ్యము. ఇది భాగ్యవంతులకు తప్పని విధి. ఇది ఆచరింపనివారు పాపమును ఒడికట్టుకొనుదురు. అట్టివారి సొమ్మే వారికి బాధాకరమగును. ధన

మును నరకములో తపింపఁజేసి వారి దేహములకు వాఁతలు వేయఁబడును. అట్టి శిక్షనుండి రక్షణపొందుటకై భాగ్యవంతులు నియమముగ జకాతు ప్రతి సంవత్సరము చెల్లింపవలెను. జకాతు చెల్లించుటకై కొన్ని షరతులు గలవు. ఎవరియొద్ద అన్ని ఖర్చులు పోయి ఏలాటి అప్పు లేకుండఁగనుండి ఒక సంవత్సరము పూర్తిగ గడచి ఏబది రెండఁన్నర తులము లెత్తు వెండిగాని ఏడు న్నరతులము లెత్తుబంగారుగాని నిలువయున్నచో వారు జకాతు చెల్లింపవలెను. ఆ హద్దునే నిసాబ్ అనుదురు. అంతకన్న తక్కువ నిలువ యున్నచో జకాతు చెల్లింప నక్కఱలేదు. లేక నిలువ యున్నంత అప్పుగూడ నుండినచో జకాతు ఇయ్య నక్కఱలేదు. పైని వివరించినంతగాని దానికన్న నెక్కువ ధనముగాని యుండినచో సంవత్సరమునకు ఒకతూరి ఉన్న ధనములో నలువదింట నొకపాలు జకాతు చెల్లింపవలెను. బాలురును పిచ్చివారును భాగ్యవంతులైనను వారి బాల్యము పిచ్చితనము పోవునంతవఱకు వారు జకాతు ఇయ్యనక్కఱలేదు. నగలలోకూడ జకాతుఉన్నది. పైని వివరించినంతధనము లేని పేదలకు జకాతు నొసంగవలెను. పేదలలో బంధువులకు ముందుగా నియ్యవలెను. తల్లి దండ్రులకును కుమారులకును మాత్రము జకాతుడబ్బు నొసంగఁగూడదు. అన్నదమ్ములకు అక్కచెల్లెండ్రకు చిన్నాయన మొదలైన దాయాదులకు వరుసగ జకాతు నొసంగవలెను. దాని పిదప ఇతరులకును పేదలకు నొసంగవలెను. వ్యాపారముచేయు అన్ని వస్తువులలోను జకాతున్నది. డబ్బులో జకాతున్నట్లు ఒంటె, ఆవు, గేదె, మేఁక, గొఱ్ఱెలలోను జకాతున్నది. అవి ఒక సంవత్సరములో నెక్కువకాలము పొలములలోఁగాని అడవులలోఁగాని మేఁత

మేసినవిగానుండవలెను. ఇంటి మేఁత మేయు పశువులలోను, బండి, మోట మొదలైన పనులలో నుపయోగింపఁబడు పశువులలోను జకాతు లేదు. ఒంటెలు అయిదుకన్న తక్కువఉన్నచో జకాతు లేదు. అయిదుగాని వానికన్న నెక్కువగా నున్నచో అందు జకాతున్నది. దాని వివరము చాలగలదు. ఇచ్చట గ్రంథవిస్తార భీతిచే వదలు చున్నాము. ఆవులు ముప్పదికన్న తక్కువగా నున్నచో జకాతులేదు. ముప్పదిగాని వానికన్న నెక్కువగాని యుండి అడవి పొలము మేఁత మేసి ఒక యేఁడు గడచినచో ఒక ఏఁడుగల ఆవుదూడను ఇయ్యవలెను. ఆవులు నలువది యున్నచో రెండు ఏండ్ల దూడను ఇయ్యవలెను. అఱువది యున్నచో ఒక ఏఁడుగల రెండుదూడల నొసంగవలెను. ఎనుబది యున్నచో రెండుఏండ్లు గల రెండు దూడలనొసంగవలెను. అటులే ప్రతిముప్పదికి ఒక ఏఁడుగలదూడను ప్రతినలువదికి రెండు ఏఁడ్లుగల దూడను ఇయ్యవలెను. గేదె జకాతుకూడ ఆవులజకాతువలె నూహింపవలెను. మేఁకలు నలువదికన్న తక్కువయున్నచో జకాతులేదు. అవి నలువదిగాని వానికన్న నెక్కువగాని యుండి ఒక ఏఁడు గడచి పొలము అడవి మేఁత మేసినవిగా నుండినచో ఒక మేఁకనియ్యవలెను. నూటఇరువదివఱకు ఒకమేఁక దానికిపైన ఒకటి హెచ్చినచో రెండువందల మేఁకలవఱకు రెండు మేఁకలనొసంగవలెను. దానిపై నొకటి హెచ్చిన మూఁడువందలవఱకు మూఁడు మేఁకల నొసంగవలెను. మేఁకలు నాలుగువందలున్నచో నాలుగు ఇయ్యవలెను. దానిపైన ప్రతివందకు ఒక మేఁక హెచ్చుగా నియ్యవలెను. మేఁకలవలె గొఱ్ఱెల జకాతు ఊహించవలెను.

—; సదఖయే ఫితర్ ;—

రమజాను పండుగ దినమున నొసంగఁబడు దానమును సదఖయేఫితర్ అనుదురు. జకాతునకువలె దీనికిఁగూడ ధనము హద్దు (నిసాబ్) గలదు. జకాతు నొసంగఁదగినవారు, దానిని ఇయ్యవలెను. మఱియు వృథాగా విలువగల వస్తువులు గల వారును సదఖయేఫితర్ బీదలకు నియ్యవలెను. వ్యాపారము చేయవలెనను షరతులేదు. దీనినియ్యఁగల భాగ్యవంతులు తమ తరపున తమబిడ్డల తరఫున సదఖయేఫితర్ ఇయ్యవలెను. నమాజునకు ముందుగానే యిచ్చినచాల శ్రేష్ఠము. తరువాతకూడ దానము చేయవచ్చును. గోధుమలుగాని దాని పిండిగాని దాని సత్తుగాని నూటనలువది (140) తులముల యెత్తును లేదా దాని వెల బీదలకు నియ్యవలెను. జౌ (యవలు) గాని దాని పిండిగాని దాని సత్తుగాని ఇన్నూట యెనుబది (280) తులముల యెత్తు బీదలకు నియ్యవలెను. బియ్యము, వడ్లు, జొన్నలు, రాగులు సజ్జలు మొదలగు ఇతర ధాన్యములు ఇయ్యవలెనన్న 140 తులముల యెత్తు గోధుమల వెలకు వచ్చునంతటి ధాన్యము బీదలకు నొసంగవలెను. పైన వ్రాసినట్లు ఒక తలకుఁగాను నొసంగఁదగినది.

:— నజర్ :—

ఏదైన మొక్కుబడి (నజర్) చేసినచో దేవునికొఱకు చేయవలెను. దాని ప్రకారము మొక్కుబడి చెల్లించవలెను. దేవుని వదలి ఇతరులకు మొక్కుబడి చేయరాదు. అట్లుచేసినచో మహాపాపమగును. అట్లుచేయువారు దేవునికి ప్రియులుకారు. కావున ఎట్టికష్టములు గలిగినను దేవునినే ప్రార్థించి యతని

సాహాయ్యమే కోరవలెను. అతనికే మొక్కుబడి చేయవలెను.

—: ఉపవాసము (రోజా) :—

రమజాను నెల పూర్తిగ ఉపవాస ముండుట ఇస్లామ్ ముఖ్యధర్మములలో నొకటి. దానినే రోజా అనుదురు. దానిం గూర్చి ఖురానెషరీఫులో చాల తాకీదున్నది. ఇది దేవునికి చాల ప్రియమైనది. దీనిచే భక్తులకు భక్తికుదురును. మనశ్శుద్ధి యగును. దీనిచే మహాపుణ్యము లభించును. స్త్రీలు పురుషులు ఉండవలసినది వదలువారు మహాపాపము చేయువారగుదురు. దానిని తిరస్కరించువారు కాఫిర్లగుదురు. ఉపవాసముండు నపుడు వేకువజామున (సుబ్ హెసాదిఖ్) నుండి సూర్యుఁడు అస్తమించు వఱకుతినకూడదు. త్రాగకూడదు. స్త్రీపురుషులు కలియరాదు. ఉపవాసము కొఱకు "బిసామిగదిన్-నవైతు-మిన్-షహ్రి-రమజాన్" అని నియ్యత్ (సంకల్పము) చేయవలెను. బాలురుకూడ ఉపవాసముండవచ్చును. స్త్రీలు ఋతు (హైజ్) కాలములోను పురుషుడు (నఫాస్) దినములలోను ఉపవాసముండకూడదు. రమజాను నెలలోని ఎన్నిదినములు తప్పిపోవునో అన్నిదినములు రమజాను నెలతరువాత ఉపవాసములుండి తీరవలెను. రోగపీడితులైన వారును గర్భిణీస్త్రీలును, పాలుత్రాపించు స్త్రీలును ప్రయాణములో నుండువారును కష్టపడుదురు అనుభీతియున్నచో ఉపవాసము లుండక పోవచ్చును. కాని ఎన్నిదినములు తప్పిపోవునో వానిని రమజాను తరువాత పూర్తి చేసికొనవలెను. దీనినే ఖజా అనుదురు. వేకువజామునకు ముందు భోజనము చేయుట చాలమంచిది. దానినే సహరీ అనుదురు. తిరిగి సూర్యుఁడు క్రుంకిన తరువాత అల్లాహుమ్మ-లక సుమ్తు-వఅలా-రి జ్ఖిక-అ ఫ్తర్తు

అని చెప్పుచు భుజింపవలెను. దీనినే ఇఫ్తారీఅనుదురు. ఉపవాస దినములలో అసత్యములాడుట, తిట్టుట, చాడీలు చెప్పుట మొదలైనవి వదలవలెను. ఉపవాసముండునప్పుడు సుర్మా వేసికొన వచ్చును. తలలోను, దేహములోను ఆముదము, నూనె అంటుకొనవచ్చును. స్నానము చేయవచ్చును పుల్ల (మిస్వాక్)తో పల్లు తోము కొనవచ్చును. బొగ్గుతోఁగాని పల్లుపొడితోఁగాని నోరు శుద్ధిచేయఁగూడదు. అత్తరుపూసికొనవచ్చును. సువాసన చూడవచ్చును. మఱచి తినినఁగాని, త్రాగినగాని, వాంతి తనంతట అదే వచ్చినగాని, పొగ తనంతట అదే నోటిలో దూరినఁగాని ఉపవాసము భంగముకాదు. ఎట్టిలోపము కలుగదు.

—: ముఫ్సిదాతెరోజా :—

ఏవిషయములచే ఉపవాసము భంగమగునో వానిని ముఫ్సిదాతెరోజా అనుదురు. అవి రెండువిధములు. ఒకటి ఉపవాస భంగము గలిగించునది. తిరిగి దానికి బదులు ఉపవాసముండినచో తీరునది. రెండవది బదులుగ ఉపవాసముండి దానికి ప్రాయశ్చిత్తము (కఫ్ఫారా) చేసిన తీరునది. (1) ఎవరైన బలవంతముగా ఉపవాసముండిన వాని నోటిలోనేదైన వస్తువు వేసిన అది కడుపులోనికి పోవుట, ఉపవాసమున్న విషయము జ్ఞప్తియుండియు నీళ్లు పుక్కిలించునపుడు నీళ్లు కడుపులోనికి పోవుట, వాంతివచ్చినపుడు కావలెనని తిరిగి లోపలికి పోవునట్లు చేయుట, కావలెనని నోటినిండుగ వాంతిచేసికొనుట, రాతి తునకగాని మట్టి బెడ్డగాని, విత్తనముగాని, కాగితపు ముక్కగాని, కావలెనని మ్రింగుట, దంతములోనున్న వస్తువును మ్రింగుట, (కనీసము అది సెనగగింజంత ఉండవలెను.) చెవులలో ఆముదముగాని

నూనెగాని పోసికొనుట. నస్యము వేసికొనుట, మఱచి తిని త్రాగి ఉపవాసము పోయెనని తలంచి తిరిగి కావలెనని తినుట త్రాగుట, తెల్లవాఱి యుండినపుడు ఇంకను తెల్లవాఱలేదు అని తలంచి తినుట, మోడము (మేఘము) వలన సూర్యుఁడు క్రుంకెను అని తలంచి తినిన తరువాత సూర్యుఁడు ఇంకను అస్తమించక యుండుట, రమజాను నెలలోని ఉపవాసములుతప్ప ఇతర ఉపవాసములను కావలెనని భంగముచేసికొనుట, అనుపై విషయములచే రోజా భంగమగును. దానికి బదులుగ మఱొక ఉపవాసముండ వలెను. అందు కఫ్ఫారాలేదు.

రమజాను రోజా ఉండియు కావలెనని భోజనపదార్థములు తినుట, త్రాగుట, కావలెనని స్త్రీ పురుషులు కలియుట, కన్నులలో సుర్మా వేసికొని ఉపవాసము భంగమైనదని అనుకొని కావలెనని భుజించుట, త్రాగుట, ఈ విషయముల వలన ఉపవాసము భంగమగును. దానికిఁగాను తిరిగి బదులుగ ఉపవాసముండి కఫ్ఫారా అను ప్రాయశ్చిత్తముచేసి తీరవలెను.

— :కఫ్ఫారా :—

వరుసగ రెండు నెలలు పూర్తిగా ఉపవాసముండవలెను. దానికి శక్తిలేనపుడు అఱువదిమంది పేదలకు రెండు పూఁటలు భోజనము పెట్టవలెను. లేక ఒక్కొక్క బీదకు నూట నలువది తులము లెత్తు గోధుమలుగాని దాని పిండిగాని దాని వెలగాని ఇయ్యవలెను. అట్లు అఱువదిమంది బీదలకు నొసంగవలెను. గోధుమల వెలకువచ్చు ఇతర ధాన్యములుకూడ నియ్యవచ్చును. ఒక్కొక్క బీదకు 140 తులములకు తక్కువ ఇయ్య కూడదు. ఒక రమజాను నెలలోని ఒకటిగాని ఎక్కువదినములు ఉపవా

సములుగాని భంగపఱచుకొన్నచో ఒక "కప్ఫారా" ఇచ్చిన చాలును. ఉపవాసములు ఎన్నిపోవునో అన్నియుండి తీరవలసినదే.

రమజానునెల తప్ప మిగిలిన దినములలో ఉపవాస ముం డెదనని వ్రతము (నజర్) చేసికొన్నచో వాని పూర్తిచేయవలెను, వానినే వాజిబ్ రోజా అనుదురు. ఇష్టపడినవారు నఫిల్ రోజా ఉండవచ్చును. అయితే ముహర్రము నెల 9, 10 వ తేదులందును బకరీదునెల 9- వ తేదియందును, ప్రతినెల 13, 14, 15-వ తేదులందును ఉపవాసముండుట, సున్నతు ఉన్నది. ఈ దినములలో హజ్రత్ పైగంబరులవారు ఉపవాసముండుచుండిరి. షవ్వాలు నెలలో ఆఱుదినములును షాబానునెల 15-వ తేది యందును ప్రతి శుక్రవారము, సోమవారము, గురువారములోను ఉపవాసముం డుట మంచిది. వానినే ముస్తహబ్ రోజా అనుదురు. రమజాను, బకరీదు, పండుగల రెండు దినములందును, బకరీదునెల, 11, 12, 13-వ తేదులందును ఉపవాసముండకూడదు. ఈ దినముల లో ఉపవాసముండుట ధర్మవిరుద్ధము. వీనినే హరామ్ రోజా అనుదురు.

## —: హజ్ (కాబాయాత్ర) :—

కాబాయాత్ర (హజ్) చేయుట ఇస్లామ్ ముఖ్యధర్మముల లో నొకటి. శక్తిగల ప్రతి ముస్లిము తన జీవితకాలములో నొకతూరి కాబాయాత్రచేసి తీరవలెను. స్త్రీలుకూడ తమవెంట భర్త లేదా బంధువు (మహరము)లలో నెవరైన ఉండినచో హజ్ చేయవలెను. హిందూదేశమునుండి పోవువారు "యలమ్ లమ్" అనుచోటున ఇహ్రాము కట్టుకొనవలెను. ఇహ్రామునకుం గాను ముందు స్నానము (గుసులు) చేసి పరిశుభ్రమైన లుంగీ దుప్పటి ధరించి అత్తరు పూసికొని రెండు రకాతులు నమాజు

చేసి "అల్లాహుమ్మ-ఇన్నీ - ఉరీదుల్ - హజ్జ-ఫ - యస్సిర్ హు-లీ వతఖబ్బల్ హు-మిన్నీ -" అని హజ్ కొఱకు సంకల్పము (నియ్యత్) చేసికొనవలెను. ఆ పిదప "లబ్బైక్ - అల్లాహుమ్మ - లబ్బైక్-లబ్బైక్ - లాషరీక - లక-లబ్బైక్ — ఇన్నల్-హమ్దు-వన్ నీ-మత-లక్-వల్-ముల్కు_లాషరీక లక్ " అని పలుకవలెను. ధరించువస్త్రములు కుట్టులేనివిగా నుండవలెను. తలపై గుడ్డ ఉండకూడదు. జగడములుగాని దుర్భాషలుగాని ఆడకూడదు. షికారు చేయకూడదు. ఇహ్రాము చేసిన పిదప హజ్ పూర్తి యగు వఱకు క్షౌరము చేయించుకొన కూడదు. శరీరములోని వెంట్రుకలను గోళ్లను కత్తిరించకూడదు, స్త్రీలతో కలియ కూడదు. స్నానముచేయవచ్చును. మక్కాపురము చేరిన పిదప కాబామసీదును దర్శించి దాని ప్రదక్షిణించవలెను. అచ్చటి యాచారములు చేయవలెను. మర్వా సఫా కొండల మధ్య చేయు ఆచారములు చేయవలెను. బకరీదు నెల ఏడవ తేది జొహరు నమాజు తరువాత ఇమాము, హజ్ ధర్మములను గూర్చి ఖుత్బా (ఉపన్యాసము) ఇచ్చును. బకరీదు నెల ఎనిమిదవ తేది ఫజరునమాజు చేసికొనిన పిదప మినా అను చోటునకు పోయి తొమ్మిదవ తేది ఫజరు నమాజు చేసికొను వఱకు నచట నుండ వలెను. ఫజరు నమాజు చేసికొనిన పిదప అరఫాతు అను మైదాన మునకు పోయి అందు నిలఁవవలెను. సూర్యోదు వాలిన పిదప జొహరు అసరు నమాజులు ఇమాము చేయించును. నమాజు చేయుటకు ముందు ఇమాము హజ్ ధర్మములు తెలుపుచు రెండు ఖుత్బాలు ఇచ్చును. జొహరు, అసరు నమాజులు ఒకేతూరి చేసికొనవలెను. అరఫాతులో నిలుచుటకు ముందు

స్నానము (గుసులు) చేయవలెను. అరఫాతులోనిలుచుట ఫరజ్ ఉన్నది. ఇది తప్పిపోయినచో హాజ్‌కూడ తప్పిపోవును. సూర్యోదయము క్రుంకువఱకు అరఫాతు మైదానములో నిలిచియుండి దేవునిని భయభక్తులతో ప్రార్థించుచుండవలెను. అనఁగా దుఆ చేయవలెను. సూర్యోదయము క్రుంకిన పిదప అరఫాతునుండి మరలి మజ్‌దలఫా అనుచోటునకు రావలెను. అచ్చట మగ్‌రిబ్ ఇషా నమాజులు చేయవలెను. అచ్చట రాత్రి బసచేసి తెల్లవాఱిన పిదప ఫజరు నమాజుచేసి సూర్యోదయము కాక మునుపే ముజ్ దలఫానుండి బయలుదేఱి మినా చేరవలెను. మినాచేరిన పిదప అచ్చటి యాచారములు చేసి ఖుర్బానీ చేయవలెను. దాని పిదప క్షౌరము చేయించుకొనవలెను ఇపుడు స్త్రీ సంభోగము తప్ప మిగిలిన నిర్బంధము లుండవు. దాని పిదప ఆదినము (బకరీదు పదియవ తేది) న గాని బకరీదు నెల 11, 12, తేదులలోఁగాని మినా నుండి మక్కాపురముచేరి కాబామసీదు చుట్టును ప్రదక్షిణము చేయవలెను. ఈ ప్రదక్షిణము (తవ్వాఫు) ఫరజ్ ఉన్నది. దీని పిదప స్త్రీలతో కూడ కలియవచ్చును. ఎట్టి నిర్బంధములుండవు ప్రదక్షిణము చేసిన పిదప తిరిగి మినాచోటికి పోవలెను. మినాలో చేయవలసిన యాచారములు చేయుటకై నాలుగు దినములు అచ్చట బసచేయవలెను. అనఁగా బకరీదు నెల 13-వ తేది వఱకు. దాని పిదప మక్కా-పురము వచ్చి కాబామసీదును ప్రదక్షిణింపవలెను. ఈ ప్రదక్షిణము వాజిబ్ ఉన్నది. దీని పిదప తమ ఇండ్లకు పోవచ్చును.

కాబా యాత్రచేయువారు మదీనాపురమునకుఁబోయి అచ్చట హాజ్‌రత్ ముహమ్మదు పైగంబరులవారి సమాధిని

దర్శింపవలెను. హాజ్రత్ వారి సమాధిదర్శనము గొప్ప భాగ్యము. దేవుఁడు ముసల్మానులకు ఆ భాగ్యము నొసంగుగాక. కాబాయాత్రను గూర్చిన యాచారములను వివరముగాఁ దెలియఁజేయుటకుఁగాను మఱియు యాత్రికుల సౌఖ్యముల అనుకూలమునకుఁగాను అచ్చట ముఅల్లిమ్ అను వారుందురు. వారు అన్ని విషయములను తెలియఁజేయుదురు. కావున మేము ఆ వివరము వదలితిమి.

—: వ్యాపారము :—

ధర్మమైన వ్యాపారము చేసి లాభము పొందవచ్చును, వ్యాపారములో మోసము చేయరాదు. వస్తువులలోనున్న లోపములను దాఁచిపెట్టరాదు. కొలతలలోను, తూనికలలోను మోసము చేయరాదు. వడ్డి వ్యాపారము చేయరాదు. వడ్డికి అప్పు కూడ తీయరాదు. సారాయి మొదలైన మత్తుపదార్థముల వ్యాపారము ముసల్మానులు చేయరాదు. ముర్దారును నెత్తురును పందులను అమ్మరాదు. మఱియు కొనరాదు. చేఁపలు నీళ్లలోనే యుండఁగా కొనరాదు. పట్టిన చేఁపలను అమ్మవచ్చును. కొనవచ్చును. లాటరీ మొదలైన జూద వ్యాపారములు చేయకూడదు. చెట్లు కాయలుగాక మునుపే పూఁతతో నున్నపుడు వ్యాపారము చేయరాదు. ధనమును వృధా అధర్మ కార్యములలో ఖర్చు చేయకూడదు. సంతోష కార్యములలోను దుఃఖ కార్యములలోను ధర్మముగ ఖర్చు చేయవలెను. శక్తికొలఁది ఖర్చు చేయవలెను. శక్తికి మించి వడ్డికి అప్పుదీసి ఏ కార్యమును చేయరాదు. అది మతమునకు విరుద్ధమును, నష్టకరమును, తుదకు ఆస్తి ధన వినాశమును అగును.

శక్తిగలవారు పెండ్లియాడుట ధర్మము. శక్తిలేనివారు ఉపవసింపవలెను. శక్తిగలిగియు పెండ్లిచేసికొనకయుండుట ధర్మవిరుద్ధము. వివాహము చేయఁదగని స్త్రీలను మహారిమ్ అనుదురు. ఒక పురుషుఁడు తన తల్లినిగాని తన సవతితల్లినిగాని తన అవ్వనుగాని తన కూఁతునుగాని తన మనుమరాలినిగాని తనతోఁబుట్టువులగు అక్కచెల్లెండ్రఁగాని తన తండ్రి కుమార్తెలఁ (మైదర్ బహెన్) గాని తన అక్కచెల్లెండ్ర కుమార్తెలఁగాని తనతండ్రి వలనఁ గలిగిన సవతితల్లి కుమార్తెల కూతులఁగాని తన మేనత్తనుగాని తన తల్లి అక్కచెల్లెండ్రఁగాని తన అన్నదమ్ముల కూతుఁలఁగాని తన భార్యతల్లినిగాని తాను పెండ్లాడిన వితంతువునకు ముందు భర్తవలన గలిగిన కూఁతునుగాని తన కోడలినిగాని తన మనుమల భార్యలఁగాని పాలుత్రాగించిన దాదినిగాని దాదికుమార్తెలఁగాని ఒకేతూరి ఇద్దఱు అక్కచెల్లెండ్రను అనగా భార్యయుండఁగా తిరిగి తనభార్య తోఁబుట్టువులను గాని తన భార్యయుండఁగా నామె మేనత్తనుగాని తనభార్య పిన్నమ్మ (ఖాలా)ను గాని తనభార్య చెల్లెకూఁతునుగాని తన భార్య అన్నదమ్ముల కూఁతులనుగాని పెండ్లిచేసికొనఁగూడదు.

ఒక బిడ్డ రెండున్నర యేండ్లవయస్సులోపల ఒక స్త్రీ పాలు త్రాగినచో ఆ బిడ్డయామెకు వివాహసంబంధములో మాత్రము సొంత బిడ్డవలెనగును. ఒకబిడ్డ తన తల్లిదండ్రుల ఏబంధువులను వివాహమాడుట అధర్మ (హరాము) మో అటులే పాలుత్రాగినబిడ్డ ఆబంధువులను పెండ్లాడకూడదు. పాలుత్రాగుటలో కొంచెము ఎక్కువ అను నియమము లేదు. ఒక గుటి

కేఁడు పాలు త్రాగినచాలును. పై బంధుత్వముగల స్త్రీలను పెండ్లియాడకూడదు. ఎవఁడైన అది ధర్మగానెంచి చేసికొని నచో మతభ్రష్టుఁడు (కాఫిరు) అగును. నరకనివాసియగును.

పెండ్లి ధర్మముగా అగుటకై కనీసము ఇద్దఱు సాక్షులుం డవలెను. భార్యాభర్తలు వివాహసంబంధము నొప్పుకొనవలెను. దానినే ఈజాబ్ ఖబూలు అనుదురు. పెండ్లికొడుకునకు సేరా గాని కంకణముగాని కట్టగూడదు స్త్రీకిఁగాను మహరు కట్ట వలెను. ఈజాబ్ ఖబూలునకు ముందుగా ఖుత్బా (ఉపన్యాసము) ఇయ్యవలెను. అందు వివాహధర్మములు బోధింపఁపలెను. ఖుత్బాపిదప ఈజాబ్ ఖబూలు జరుగవలెను. ఆ పిదప అందఱు 'బారకల్లాహు-వబారక-అలై క_వజమఅ-బై నకుమా-ఫీఖై రిన్' అని పెండ్లికొడుకును దీవింపవలెను. ఖర్జూరము మొదలైనవి ఎగుర వేయుటమంచిది. పెండ్లిఅయిన మఱుసటిదినము శక్తికొలఁది విందుచేయవలెను దీనినే వలీమా అనుదురు. శక్తిలేనపుడు వడ్డికి అప్పుదీసి విందుచేయరాదు. 'భార్యాభర్తలు కలియునపుడు "బిస్మిల్లాహి_అల్లాహుమ్మ_జన్నిబ్_నష్షైతాన-వజన్ని_బిష్షైతాన_మారజఖ్తనా" అని చదువవలెను. దీనిచే సంతానము షైతానువలని నష్టముచే రక్షింపఁబడును.

—: పెండ్లాడఁదగిన స్త్రీలు :—

ఒక పురుషుఁడు తన మేనత్త తన పినతల్లి తన మేనమామ తన పినతండ్రి కుమార్తెలను వివాహ మాడవచ్చును. ఎట్టిదోష ములేదు. మఱియు బంధుత్వములేని ఇతర ముస్లిముల కూఁతులనుకూడ వివాహమాడవచ్చును. ఒకేతూరి నలుగురి కన్న నెక్కువమంది భార్యలుండకూడదు. ఒకతెకన్న నెక్కువభార్యలు

గలవారు తమ భార్యల విషయమున న్యాయము పాటించవలెను. పక్షపాతముచేసి అన్యాయము చేసినచో పాపులగుదురు. న్యాయముచేసి భార్యలను కాపాడలేనివారు ఒక భార్యయందే తృప్తి చెంది యుండవలెను.

బిడ్డ పుట్టినపుడు కుడి చెవిలో అజాను ఎడమ చెవిలో ఇఖామతు చెప్పవలెను. ఏడవదినమున మగబిడ్డకుగాను శక్తియున్నచో రెండు మేకలును ఆడుబిడ్డకుగాను ఒక మేకను జబా చేయవలయును. బిడ్డతల గొఱిగించి మంచి పేరుంచ వలెను. శక్తియున్నచో ఆ వెండ్రుకలయెత్తు వెండిగాని, బంగారుగాని బీదలకు దానము చేయవలెను. యుక్తవయస్సు రాకమునుపే ఖతనా చేయవలయును. మఱియు మత విద్య నేర్పవలయును.

దుఆయెఖతమ్:—అల్ హమ్దు _ లిల్లాహి_రబ్బిల్ _ ఆలమీన్_వల్_ఆఖిబతు-లిల్_ముత్తఖీన్_వస్సలాతువస్సలాము అలా_రసూలిహిల్-కరీమ్_వ_ఆలాఆలిహీ_వ_అస్_హాబిహీ అజ్_మఈన్ _ రబ్బనా_తఖబ్బల్_మిన్నా_ఇన్నక_అన్తస్_సమీఉల్ _ అలీమ్ వతుబ్_అలైనా_ఇన్నక_అన్తత్_తవ్వాబుర్ రహీమ్_వసల్ _ లల్లాహు_తఆలా _ అలాఖైరి_ఖల్ ఖిహీ సయ్యిదినా_ముహమ్మదిన్_వఅలాఆలిహీ_వఅస్ హాబిహీ_అజ్ మఈన్ సుబ్ హాన_ రబ్బిక_రబ్బిల్_ఇజ్ జతి _ అమ్మాయసిఫూన_ వసలామున్-అలల్-ముర్-సలీన్-వల్ హమ్దు-లిల్లాహి _ రబ్బిల్ ఆలమీన్.

---

Printed by Sri M. Singaracharier, B. A., B. L.,
Manager, V. J. Press, Chittoor.
(appointed by District Judge, Chittoor.)

తెనుఁగు నందలి ఇస్లామ్‌మత గ్రంథములు :—

...రయే అల్ హమ్ద్ ఖురానె షరీఫ్ యొక్క 30 వ కాండమునకు ...్యాన సహితము 38 సూరాలు గలది 1—0—0.

...ష్కాతెషరీఫ్ మొదటి సంపుటము ఇందు ఈమాన్, మత విశ్వ... గూర్చి హజ్రత్ రసూలువారి 513 ఉపదేశము (హదీసు) లకు తర్జుమా వ్యాఖ్యానము గలదు 2—8—0.

(3) మిష్కాతె షరీఫ్ రెండవ సంపుటము. ఇందు నమాజు మొదలగు వాని గూర్చి హజ్రత్ రసూలువారి 1158 ఉపదేశములకు తర్జుమా వ్యాఖ్యానము గలదు 4—0—0.

(4) జగత్ ప్రవక్త హజ్రత్ ముహమ్మదు రసూలువారి దివ్య చరిత్రము రెండు భాగములు ఒకే సంపుటము. 2—8—0.

(5) ఇస్లామ్‌మత ప్రభువులు మొదటిభాగము. ఇందు హజ్రత్ అబూబకరు హజ్రత్ ఉమరువారి చరిత్రములు గలవు 2—0—0.

(6) ఇస్లామ్ మతప్రభువులు (ఖులఫాయెరాషిదీన్) రెండవభాగము ఇందు హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ అలీవారి చరిత్రములు గలవు 1—8—0.

(7) అహ్కాముల్ ఇస్లామ్ ఇందు ఈమాన్ నమాజు ఉపవాసము జకాతు, హజ్ మొదలగు ఇస్లామ్ మత దర్మములు గలవు 0—8—0.

వలయువారు:—

మౌల్వీ ముహమ్మద్ అబ్దుల్ గఫూర్,

కోనేటివీధి, కంబము (కర్నూలుజిల్లా.)



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 101 B 170 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/[illegible] |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BC |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | naga |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |